

యువభారతి సాహితీమిత్రుల

ఉగాది కవితాసంకలనం

ప్రచురణ :




యువభారతి
సాహితీ చైతన్యంతో
పదో వసంతం*

(1963-1973)

యువభారతి
సాహితీసాంస్కృతికసంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

USHASSU ఉషస్సు
AN ANTHOLOGY OF POETRY

యువభారతి

ప్రచురణ : 12

ప్రథమ ముద్రణ : 1,000 ప్రతులు
ఏప్రెల్ 4, 1973.

ముఖపత్ర రచన, అక్షరాలంకరణ :
సుధామ

ముద్రణ :
విజయశ్రీ ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500003.

కార్యాలయం :
యువభారతి
ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్డు, హైద్రాబాదు - 500001.

వెల : మూడు రూపాయలు

# ప్రస్తావన




ఇది ఉగాది. అనాదిగా అచ్చమైన తెలుగుతనం సంతరించుకున్న ముచ్చటైన మొదటి పండుగ ఇది. వసంతమన్నా, కోయిల కూజితాలన్నా సాహితీ జగత్తుకు వేడుక. ఈ తరుణంలో వేకువ తొలి వెలుగులుగా రూపు దిద్దుకున్న 'ఉషస్సు' అవతరిస్తున్నది. యువభారతి సాహితీ మిత్రుల కవితా చైతన్యాన్ని "ఉషస్సు" ఆవిష్కరిస్తున్నది. సాహితీమైత్రికి మొదటి కానుకగా, అక్షరాకృతి దాల్చి అలరిస్తున్నది. సాహితీమిత్ర సభ్యులలో నూటముప్పైమంది రచనలను "ఉషస్సు"గా సమర్పించుకోగలుగుతున్నందుకు ఎంతో సంతోషిస్తున్నాం.

సమాజంలో సాహిత్య రాసిక్యాన్ని సముల్లసితం చేయాలనీ, రస హృదయాలకు సామరస్య ఫలాలనందిస్తూనే జాతి నవజీవన పురోగతికి కావలసిన చేతనాత్మక వాతావరణాన్ని సృజించాలనీ పది సంవత్సరాలుగా కృషి చేస్తున్న సంస్థ యువభారతి. రమ్యమైన ఈ గమ్యానికి చేరుకోవాలనీ, దానికోసం ఉత్తమ సాహిత్యాన్ని వీలయినంత ఎక్కువ మందికి వీలయినంత తక్కువధర కందించాలనీ ఎన్నో కార్యక్రమాల నేర్పాటు చేసి సహృదయల సహాయ సహకారాలతో నిర్విఘ్నంగా నిర్వహించింది. మా రచన, కావ్యలహరి, చైతన్యలహరి, మహతి ప్రచురణ కార్యక్రమాల సందర్భంగా దేశంలోని సాహితీప్రియులతో మాకేర్పడిన మైత్రి సంబంధమే సాహితీమిత్ర పథకంగా రూపు దిద్దుకొంది. ఈ వసంతానికి సాహితీ మిత్రులసంఖ్య పదిహేను వందలు. విజయదశమినాటికి ఈ సంఖ్య మరో పదింతలు పెరగాలని మా ఆకాంక్ష.

సాహితీమిత్ర పథకం ఎంతో విస్తృతం. ఇప్పటికే ఇందులో రకరకాల శక్తిసామర్థ్యాలు కలిగినవారున్నారు. కవులున్నారు, కథకులున్నారు. సాహితీ రసికులున్నారు. లబ్ధప్రతిష్ఠులున్నారు. ఇప్పుడిప్పుడే రచనకు శ్రీకారం చుట్టుతున్న చిరంజీవులున్నారు.

సాహితీ మిత్రులకు రచనా ప్రోత్సాహం కల్గుతుందనీ అంతర్లీనంగా నున్న ప్రతిభకు నీరుపోసి, ఆ బీజం ఒక భూజంగా మారుటకవకాశం కల్గించాలనీ, ఎక్కడెక్కడో నున్న సాహితీమిత్రులను ఒక్క వేదిక మీదకి తెచ్చి వారి సాహితీ చైతన్యాన్ని ప్రజానీకానికి పరిచయం చేయాలని, తద్వారా వర్తమాన సాహిత్యపు తీరుతెన్నుల అవగాహనకు తోడ్పడాలనీ సంకల్పించి ఈ ప్రమాదీచ ఉగాది సందర్భంగా సాహితీ మిత్రుల కవితాసంకలనం ఒకటి వెలువరించాలనీ యువభారతి నిశ్చయించింది. ఈ విధంగా ఒక రకంగా యువభారతి సంస్థకూ, సాహితీమిత్రులకూ మధ్యగల సాహితీ బాంధవ్యానికి ఈ "ఉషస్సు" కవితాసంకలనం ఒక అక్షరాకృతి. ఇది సాహితీ మిత్ర పథక ప్రచురణల పరంపరలో మొదటి కృతి.

కవితా సంకలనోద్దేశాన్ని ప్రకటించగానే సాహితీ మిత్రులెన్నెన్నో రచనలు పంపించారు. వెన్నుతట్టి మమ్ము ముందుకు నడిపించారు. పంపిన కవితలెన్నయినా, ఎంతదీర్ఘమైనవైనా వానిని అనుకున్న ప్రకారం ఇరవై నాల్గు పంక్తులుగా ఒక పుటలో ఇమిడే రీతిగా కొన్నింటిని త్రుంచి, మరి కొన్నింటిని శాబ్దికంగా సంస్కరించి, సవరించి కవిహృదయం వ్యక్తమయ్యేలా అవసరమైన మార్పులు కూర్పులు చేయడం జరిగింది. సహృదయ సాహితీ మిత్రులు మమ్మల్ని ఇందుకు అపార్థం చేసుకోరని విశ్వసిస్తున్నాం.

ఉగాది కవితాసంకలన కరపత్రాన్ని చూడని సాహితీమిత్రులు కొందరు కవితలను పంపి అచ్చు ఖర్చులో పాలుపంచుకునే నిమిత్తం అడిగిన పది రూపాయలకు అభ్యంతరం తెలిపారు. మొదటనే మా కరపత్రం చూచినట్లయితే వారు అలా అభ్యంతరం తెలిపియుండేవారు కారని యువభారతికి తెలుసు. చేస్తున్నపని మంచిదని గమనించిన యువభారతి మొదటనే ఆర్థికమైన హార్దికమైన అన్ని విషయాలూ సవివరంగా విన్నవించు కున్నది. వెలుగుచూడని రచనలకెన్నింటికో విస్తృత వేదికనేర్పాటు చేయదలచుకున్నది. అందరికీ తెలిసిన వారినేగాక అజ్ఞాతంగానున్న ప్రజ్ఞామూర్తులను పఠితృలోకానికి పరిచయం చేయదలచుకున్నది. ఈ సదభిప్రాయంతో ముందుకు సాగుతున్న యువభారతిని చూచి ఎన్నో గుండెలు అఖండంగా హర్షించినవి. తమ సౌముఖ్యాన్ని, సహకారాన్ని వర్షించినవి. విమర్శలు విసుర్లు ఎదురైనా బెదరించినా సాహితీ మిత్రుల ప్రతిభా ప్రదర్శనకు యువభారతి వేదికగా_ప్రాతిపదికగా కలిగిస్తున్న అవకాశం అభిలషణీయమనే ఆలోచన బలంగా కలుగుతున్నది.

ఉషస్సు కవితాసంకలనానికి సాహితీ మిత్రులనుండి లభించిన ప్రోత్సాహం ఆశాజనకంగా ఉండడమేగాక, కథాసంకలనానికి ప్రేరణగా రూపొందింది. కథారచనా వ్యాసంగంలో అభిరుచిగల సాహితీమిత్రులు కొందరు "ఉషస్సు" రూపొందించిన తీరులోనే కథాసంకలనమొకటి రూపొందించ బడాలని సూచించారు. అందుకే–సాహితీ మిత్రులు సమర్పిస్తున్న మలికృతిగా, దశమవార్షికోత్సవాల కానుకగా కథాసంకలనం "కథావాహిని"ని రూపొందించి సమర్పిస్తున్నాము. "ఉషస్సు"లానే ఈ ప్రయత్నమూ సాహితీమిత్రుల అండదండలను సమృద్ధిగా పొంది జయప్రద మవుతుందనీ–ఇలానే ప్రతి యేడూ ఉగాదికి ఓ కవితా సంకలనమూ, విజయదశమికి కథాసంకలనమూ వెలువరించి, సాహితీమిత్రులతో ఏర్పడిన మైత్రిని మరింత గాఢతరం చేయాలనీ– ధ్యేయసాధనాకృషిలో ముందడుగు వేయగలగాలనీ సంకల్పిస్తున్నాం.

తెలుగువారికి ముచ్చటైన మొదటి పండుగైన ఈ ఉగాదినాడు యువభారతి కవితాసంకలనం "స్వరాలు" శ్రీ శిలావీర్రాజుగారి "మళ్ళీ వెలుగు"తో పాటు సాహితీ మిత్రుల ఈ "ఉషస్సును"ను తమ కరకమలాలతో ఆవిష్కరించడానికి సౌహార్దంతో సమ్మతించిన సరస కవితావతంసులు–డా॥ సి. నారాయణరెడ్డిగారికి, ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన సాహితీ బంధువులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శులయిన శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారికి ఆదరాభిమాన పురస్సరంగా అభివందనాలు.

ఈ సంకలనంలో ప్రచురించడానికి తమ కవితల నందించి హార్దికంగా ఆర్థికంగా సహకరించిన "ఉషస్సు" కవుల సౌహార్దాన్ని ఔదార్యాన్ని మరువలేము.

ఈ కవితాసంకలన ప్రచురణ రూపకల్పన చేసి అడుగడుగున ఆత్మీయతతో ఈ కార్యాన్ని పర్యవేక్షించి తోడ్పడిన యువభారతి అధ్యక్షులు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి, ప్రధాన సంపాదకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి, సమావేశ కర్త శ్రీ వంగపల్లి విశ్వనాథం గారికి మేమెంతో ఋణపడి యున్నాం.

మంచితనాన్ని కుంచెతో చూపించి "ఉషస్సు" ముఖపత్రాన్ని నేత్రపర్వంగా చిత్రించిన శ్రీ "సుధామ"కు మా కృతజ్ఞతలు.

ఉషస్సు ప్రచురణ కార్యక్రమానికి అవసరమైన కార్యాలయ కార్యక్రమా

అన్నింటినీ సక్రమంగా నిర్వహించి తమ సామర్థ్యంతో మా పనిని సుకరం చేసిన మిత్రులు శ్రీ వి. హరినాథ్ గారికి మా ధన్యవాదాలు.

ఈ సంకలన ముద్రణ భారాన్ని నిర్దిష్ట దృష్టితో వహించిన యువభారతి సహసమావేశకర్తలు శ్రీ విజయకుమార్, శ్రీ విశ్వనాథ సూర్యనారాయణ గార్లకు మా హృదయపూర్వక ధన్యవాదాలు.

"ఉషస్సు" ముఖ పత్రాన్ని అచ్చొత్తిన విస్టాస్ ప్రింటర్స్ వారికి, సకాలానికి కవితాసంకలనాన్ని అచ్చువోసిన విజయశ్రీ ప్రింటింగ్ వర్క్స్, శ్రీ ఎ. సూర్యనారాయణగారికి మా కృతజ్ఞతలు.

చైతన్యమను చిక్కని పాలలో సౌజన్యమను చక్కెరను కలిపి ఆస్వాదిస్తే మేథకు పదును, హృదయానికి సుధను అందించినట్లవుతుందని, ఆరోగ్యం, హాయి అందుబాటులో ఉంటాయని నమ్ముతున్న యువభారతి సాహితీ మిత్రుల ప్రోత్సాహంతో ముందుముందు కూడా ఇదేవిధంగా కవితాసంకలనాలతో, నవవసంతాల నాహ్వానించాలని యువ సాహితీ జగత్తునవతరింపజేయాలని అహర్నిశలూ ఆకాంక్షిస్తూ మీ చేయూతను అర్థిస్తూ—

తిరుమల శ్రీనివాసాచార్యులు

యువభారతి

# మా సంగతి




ప్రతిభా కళిక వికసనం పొందడానికి తన పరిమళాలను వెదజల్లి దీప్తం వ్యాప్తం కావడానికి అనువైన వాతావరణం ఏర్పడినప్పుడే సమాజం సజీవంగానూ, నిత్యనూతనంగానూ, నిర్మాణాత్మకంగానూ, అభ్యుదయ పథంలో సాగిపోగలుగుతుంది.

యువతరంలో నిర్మాణైక దృక్పథాన్ని, అధ్యయన శీలతను, పరస్పరావగాహనను, పెంపొందించ గలిగితేనే ప్రజాస్వామ్య వ్యవస్థకు సుస్థిరమైన పునాది ఏర్పడుతుంది. ప్రజలను సమీకరించడానికి రాజకీయోద్యమాలు తాత్కాలికంగా కారణమౌతాయేమోగాని, నిరంతరం సభ్యతా మర్యాదలూ, ప్రేమానురాగాలూ, సాహిత్యోద్యమం వల్లనే రూపొందుతాయనడం యథార్థం. పుస్తకాలను చదివించి పాఠకులకూ రచయితలకూ మధ్య సద్భావ సేతువును నిర్మించి పఠనాసక్తిని పెంపొందిస్తే సాహిత్య ప్రయోజనం సమకూరుతుందని యువభారతి విశ్వాసం. గత పదేండ్లుగా యువభారతి వివిధ ఉపన్యాస, పుస్తక ప్రచురణ, గోష్ఠి, సమీక్షావ్యాస సంకలన ప్రచురణలే కాకుండా ప్రతిమాసం రెండుమార్లు సమావేశమై సంస్థ సభ్యుల్లో నిద్రాణంగా ఉన్న సృజనాత్మక శక్తులను ప్రేరేచి, ఉద్దీప్తం చేయడానికి రకరకాల సాహితీ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

ఆలోచనా స్వేచ్ఛను దేశపురోగతికి తోడ్పడేవిధంగానూ, సృజనాత్మక రచన ప్రతిభాసమున్మేషణానికి దోహదంగానూ, వ్యక్తిత్వ నిర్మాణం దేశ నిర్మాణంతో పెనవేసుకొని పోయే విధంగానూ, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించాలనే దృఢ సంకల్పంతో యువభారతి వివిధ కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది.

ఇటీవలనే యువభారతి ప్రారంభించిన 'సాహితీమిత్ర' పథకం యావద్భారత దేశంలోని తెలుగు సాహితీప్రియుల సహకార సద్భావాల ఊతగా తీసుకుని సాహిత్య కార్యక్రమాలను నిర్విఘ్నంగా నిర్వహించడానికి రూపొందించబడ్డది. దేశంలో తెలుగు రసికుడు ఎక్కడున్నా సరే! అతడు యువభారతికి తోడ్పడగలుగుతున్నాననే తృప్తి పొందేట్టుగానూ దీనికి రూపకల్పన చేయబడింది. ఇంతవరకూ 1,500 మంది సాహితీ మిత్రులుగా చేరి యువభారతి కార్యకలాపాలపట్ల తమ తృప్తిని, విశ్వాసాన్ని ప్రకటించారు.

ప్రాచీన అర్వాచీన సాహితీ మర్యాదలతో పఠితృలోకానికి పరిచయం చేయ డానికి సమకాలీన సమస్యల పరిజ్ఞానం కలిగించడానికి, యువభారతి ఇంతవరకు 'కావ్యలహరి', 'చైతన్యలహరి' 'రచన' 'మహతి' గ్రంథాలను ప్రచురించి సాహితీ ప్రియుల మన్ననలను, విజ్ఞుల ఆశీస్సులను, పొందగలిగిందని సవినయంగా మనవి చేస్తున్నాం.

సాహితీమిత్రులను ఒక ప్రాంగణంలోకి తీసుకురావడానికి, సాహితీమిత్రుల కవితా సంకలనం 'ఉషస్సు' ఈ ఉగాదినాడు వెలువరిస్తున్నాం. 'యువభారతీయు'ల కవితాసంకలనాలు 'వీచికలు' 'అక్షరాలు' ఇంతవరకు వెలువడ్డాయి. ఉగాదినాడు వెలువడేది 'స్వరాలు'. మాకు ఆప్తులూ, కవితాప్రతిభా సంపద్యుక్తులూ అయిన శ్రీ శీలావీర్రాజు గారి వచన కవితాప్రయోగం 'మళ్ళీవెలుగు'ను ఈ ఉగాదినాడే వెలువరిస్తున్నాము.

తెలుగుజాతిని తమ సాహిత్యంద్వారా, మహోదాత్త జీవితంద్వారా ఉద్దీప్తం చేసిన మహామనీషులు నన్నయ, పోతన, పింగళి సూరన, కందుకూరి వీరేశలింగం, తిరుపతి వేంకటకవులపై విజ్ఞులచేత ఉపన్యాసా లిప్పించి వాటికి 'వికాసలహరి' అనే పుస్తకరూపం కల్పించి సాహితీమిత్రులకు ఉచితంగానూ, ఇతర సరసులకు ప్రచురణపూర్వ విరాళానికి అందించడానికి ప్రణాళికను సిద్ధంచేశాము.

వివిధ రంగాలలో యువకులు నిర్వహించిన, నిర్వహించవలసిన పాత్రనుగూర్చి ఒక గోష్ఠి కార్యక్రమాన్ని నిర్వహించడానికికూడా పథకం సిద్ధమైంది.
ఒక క్రమబద్ధమైన పద్ధతిలో విశాల దృక్పథంతో, నిర్మాణైక బుద్ధితో యువభారతి ముందుకు సాగిపోతోంది. సాహితీప్రియుల, సాహితీమిత్రుల ఆదరాభిమానాలతో, అండదండలతో సమాజంలో రాసిక్యాన్ని, సహనభావాన్ని, సౌందర్యపిపాసనూ, దేశభక్తినీ ఉద్బుద్ధం చేయడానికి ప్రయత్నం చేస్తుంది.

చైతన్యపూరితమైన ఆశయసాధనా సంరంభాన్ని జడమైన అచ్చుసిరాద్వారా అందించగలగడం కష్టం. సహృదయులు దీని వెనుకనున్న చైతన్యస్రవంతిని పోల్చుకో గలరనీ, వారి సహాయ సహకారాల నందించగలరని

విశ్వాసంతో,

ఇరివెంటి కృష్ణమూర్తి.

యువభారతి

# యువభారతి ప్రచురణలు




1. సరస్వతీ సాక్షాత్కారం - అనుముల కృష్ణమూర్తి (కావ్యం) రు. 3-00

•2. జీవనగీత - కాళోజి (మానవాళికి నివాళులెత్తిన కారుణ్యోపనిషత్తు) రు. 2-50

•3. వీచికలు (కవితా సంకలనం) 2-00

•4. పంచవటి (కథల సంపుటి) రు. 2-00

5. రచన (మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు-వ్యాస సంపుటి) రు. 7-00

•6. కావ్యలహరి - ఆచార్య దివాకర్ల వేంకటావధాని (ఉపన్యాస మంజరి) రు. 5-00

•7. అక్షరాలు (కవితా సంకలనం) రు. 2-00

8. చైతన్యలహరి - ఉపన్యాసమంజరి రు. 6-00

9. మహతి - స్వాతంత్ర్య యుగోదయంలో ఆంధ్ర సారస్వత సందర్శనం (నూర్గురు ప్రముఖుల వ్యాస సంకలనం) రు. 20-00

10. ఫ్రీ ఇండియా ఫోర్జెస్ ఎహెడ్ (34 వ్యాసాల సంకలనం) రు. 10-00

11. స్వరాలు (కవితా సంకలనం) రు. 3-00

12. ఉషస్సు (యువభారతి సాహితీమిత్రుల ఉగాది కవితా సంకలనం) రు. 3-00

13. మళ్ళీ వెలుగు - శీలా వీర్రాజు (వచన కవితా కావ్యం) రు. 4-00

---

• ఈ గుర్తుగల పుస్తకముల ప్రతులు లేవు.

# ఉషా రేఖలు

—తిరుమల శ్రీనివాసాచార్యులు

సాహితీ చైతన్యంతో పదోవసంతంలో పదమూనిన యువభారతి, 'ఉషస్సు' అను "సాహితీ మిత్రుల" కవితాసంకలనం ద్వారా ప్రమాటీచ వసంతోషస్సునకు స్వాగతవచనాలు పలకడం అత్యంత ప్రమోదంగా ఉంది. ఈ 'ఉషస్సు' నూట ముప్పైమంది సాహితీమిత్రులు సహృదయలోకానికి సమర్పించిన ప్రథమ కవితా వాసంతప్రసూనం. ఈ సంకలన ప్రపంచంలో ఇదివరకే ప్రతిభాధాళధళ్యమును ప్రసరించిన పరిణత కీర్తిమూర్తులేకాక సాహిత్యప్రస్థానంలో కొంతదూరం పయనించిన మధ్యతరగతి మందహాసులునూ, ఇప్పుడిప్పుడే ఎదలో విరిసిన ఉషస్సును పదిమందికి పంచాలనే ఉత్కంఠగల ఔత్సాహిక మిత్రులు కనిపిస్తున్నారు. ఈ కవిమిత్రమండలిలో కవయిత్రులు కూడా కనపడడం ఒక విశేషం.

"ప్రక్రియా పుష్పమేదైనా కవితా పరిమళముంటే చాలు, వస్తువెలాంటిదైనా ప్రదర్శన ప్రశస్తంగా ఉంటేచాలు, సహృదయలోకం సంతోషంగా ఆహ్వానిస్తుంది ఆదరిస్తుంది" అనే నమ్మకమున్న సాహితీ మిత్రులు వీరందరు. అందుకే పద్యాల ఉద్యమాలు, గేయాల తీరుతీయాలు, వచన కవితారస ప్రదర్శనలు ఈ సంకలనజగత్తులో సరిత్తుల్లా ప్రవహిస్తున్నాయి. ఇందులోని కవితలు శతాధికమైనా వేయి వెలుగులు తొంగిచూస్తున్నట్లనిపిస్తుంది. అన్నీ చూపలేనప్పుడు కొన్నింటినైనా పరిచయం చేయడం ఉచితం.

విజ్ఞానశాస్త్రార్థాన్ని కూడా గేయంలో తీయతీయగా చిల్కిన గురులఘు నియమాలచే గాక గురుత్వాకర్షణ ఆకాశవక్రత్వ సిద్ధాంతాలను పల్కిన కవిత ఈ సంకలనంలో ముందుగా మందహాసం చేస్తుంది. "నీకు బాసట కేవలం నిన్నువీడని ధీబల"మని 'మతాబు దివ్వెలోంచి వెలుగురవ్వలు రాలకమానవు, భవిష్యత్తులోంచి ఆశలురాకమానవని" – "మహతిపలికే అమరావతిపిలిచే గ్రహణం విడిచే మంచిగడియలొస్తాయని" ఆశారేఖలు ఆహ్వానిస్తున్నాయి సహృదయులను. "హిట్లరంతటి వాడు

విరగబడి చచ్చాడు. ముస్సోలినీ మురిగిపోయినాడు మానవా! ఇదినీవు కానవా!"
అంటూ ఒక ఉషోరేఖ సౌజన్యాన్ని పెంచమని చాటిచెబుతున్నది. మరో వెలుగురేక
"పిట్టకోసం గెట్టుకోసం కొట్లాడడం పిచ్చితనమని, వసుధైక కుటుంబానికి వారసత్వం
పొందాలని" సమైక్యతా తుషారబిందు బృందాన్ని మెరిపిస్తున్నది. 'మూడు తరగతు
లను ఏకీకరణం చేయడంలో వీలయినంత సమత జగతియందు పంచబడా"లని చెరగని
సమతావాదం నేనేర్చిన వేదం" అని కొన్ని వెలుగులు ఎలుగెత్తి చాటుతున్నవి. "దేశం
కోసం నీ జీవితాన్ని త్యాగం చెయ్యడం నేర్చుకో," అని కిరణాల్లాంటి చరణాలతో
ముందుకు నడుస్తూ త్యాగవీణలు మీటుతున్నాయి కొన్ని. 'నేను ప్రజాహృదంతర
కథనాన్ని నవకవనాన్ని' "మానవత్వం, మమతలను నేర్పని మతాలెందుకు?" "మనిషి
లోని విలువల్ని మనిషి బ్రతికుండగా గ్రహించక పోవడం ఈలోకం అలవాటు-ఇది
ఎప్పుడూ జరిగే పొరపాటు" మనిషి 'ఉత్తరంలా అనేక ప్రయోజనకారి కావాలి'
'మానవత్వం ఉన్న ప్రతిమనిషి నా దేవుడు' 'మనసున్న మనిషి జీవించాలి' అని
ఇందలికవితలెన్నో మానవతామయుడైన మనిషికి మకుటంపెట్టి సహృదయతను ప్రక
టించినవి. ప్రజారాజ్యంలోని ప్రతివాని ధర్మకర్తృత్వం అదేగా.

ఇజాలను, పచ్చినిజాలను, మీటింగులను, సీలింగులను, ఆస్తికత్వాన్ని, నాస్తి
కత్వాన్ని, భక్తిని, విముక్తిని భగవంతుని సర్వాత్మకశక్తిని, ఉషస్సును, విషతమస్సును,
నవతాళ్రతువులను, శివరాత్రులను, ప్రేమోపాసకులను, భామాదాసులను, నిరుపేదలను,
నిరుద్యోగులను, కాలగతిని, యువభారతిని, నగరంలోని వర్షాన్ని, ఉగాది హర్షాన్ని,
చంద్రుని, ఇందిరను, వాసంతసుందరిని, సత్యాలను, గోహత్యలను, మాట్లాడేమంట
లను, రామరాజ్యపు మాటలను, శృంగార శృంగాలను, నాయకుల కార్యరంగాలను,
లంచాలను, వంచనలను ఒక్కటేమిటి ఇలా ఎన్నింటినో పఠితలకు పరిచయం చేస్తు
న్నాయి ఇందలి కవితలు. అడుగడుగునా మనిషి మనుగడను సవాలుచేస్తున్న సమ
స్యల మండుటెండల్లో తపించిపోతున్న మానవాళి ఆవేదను రానున్న శరత్పూర్ణిమా
చంద్రికల్లో ఓలలాడాలనే ఆకాంక్షను ఈ కవులు వ్యక్తంచేస్తున్నారు.

విషయమేదైనా రసాత్మకంగా, కవితా ప్రక్రియఏదైనా నవతాస్ఫోరకంగా
చెప్పాలనే ప్రయత్నం ఈ సంకలనంలో కనిపిస్తుంది. కొన్ని కవితలు ప్రశ్నాత్మకంగా
ఉండి సహృదయులనుంచే సమాధానాలు ఆశిస్తాయి. మరికొన్ని పఠితలను బాధించక

వారి ముందే ప్రశ్నోత్తరాలు ఏకరువు పెడుతాయి. అయినా ఆనందానికి కరువుండదు. కొన్ని రచనలు సినీగీతికల ఫక్కీని ప్రదర్శిస్తున్నాయి. ఈనాటి అన్నలు ఆనాటి తిక్కన్నలా స్వప్నంలో దైవాన్ని చూస్తూనే ఉన్నారు. శారదతో సంభాషిస్తూనే ఉన్నారు. ఎందుకు? డెందంలో కవితాంశ ఉన్నందుకు.

ఈ 'ఉషస్సు' కవితా సంకలనంలో శీతల తుషార పరంపరతో పాటు సాహిత్యశాస్త్రానికి లక్ష్యాలు కూడా కనిపిస్తాయి. 'కుండ' అనే కవిత కథలాగా కదలి కావ్యాత్మయైన ధ్వనిని జీర్ణించుకున్నది. "సందెవెలుగుపోయింది అంధకారం వెలిసింది కష్టించినా ప్రతిఫలమివ్వని యజమానివలె" వంటిచక్కని సరికొత్త ఉపమాలంకారాలు కనిపిస్తాయి. 'అచ్యుతమూ జ్ఞానముతో' అనుచోట కవినామం శ్లేషలో వినపడుతువ్నది. "బ్రతుకు పరిషత్ సభాపతియన సూర్యుడు" తొంగి చూచినాడన్నప్పుడు సహృదయుడా ఉత్ప్రేక్షను వీక్షించక మానడు. 'షైలాక్‌ను నేను షైనెస్‌లాక్ చేసి' 'ఇది డెమోక్రసీ గాదు డెమన్–ఓ–కసియేగాని' 'మేకులు కొట్టిచంపి ఏమంటూ పుట్టిందో ఈ "క్రీస్తు"శకం 'సమతాధ్యక్షుని ప్రేల్చిన శబ్దా "లింకన్" వినిపించును కదా - 'ప్రేమ దేవతను "బాపు"రే రూపుమాపినప్పటి 'శాంతి "కింగు"వ్వలాంటి, "మనమింకెన్నడీ" జగద్బాంధవుల అడుగుజాడలబడి నడచేది" వంటి చరణాలు శాబ్దికచమత్కారాన్ని ఆశ్రయించినాయి. 'వటకన్య' 'ఉల్లిపొరల పుస్తె' మున్నగు కొన్ని సుందర పదబంధాలగుపిస్తున్నాయి ఈ కవితాసంకలనంలో. 'జ్వాలను మలయానిలయంచేయ్' అని సాహిత్యానందాన్ని కల్గిస్తూనే ఉపదేశాన్ని కూడా మరచిపోలేటి కవితాసంకలనం. 'విశ్వశ్రేయఃకావ్యమ్' అనికదా ఆర్యోక్తి. అందుకే "ప్రజలమేలు కోరు బ్రహ్మపదం పలకాలి నీనోట" అప్పుడే "అనుసరిస్తారు ప్రజలంతా నీబాట కవితకు విలువుంటుంటీ చోట" అని శారదాదేవి కవికి ఉపదేశ మిచ్చిందట.

ఈ విధంగా "స్నిగ్ధపాటల వర్ణరంజిత 'ఉషస్సు' స్వర్ణకింకిణుల్ రవళింప" ఇరులను తరిమికొడుతున్నది. 'చేదుబ్రతుకున మాధురులు' చిలుకరిస్తున్నది.

తన ఎదపొరల్లో ఒదిగియున్న కవితా పరిమళాలతో సమాజాన్ని రసప్లావితం చేయాలనే కామన మిక్కుటంగా ఉన్నా, అదను దొరకక, వేదికలేక ఆదరణలభించక అణగారి పోతున్నదేకాని బహిర్గతం కావడం లేదు. యువభారతి తలపెట్టిన 'ఉషస్సు' ఈ ప్రయాణంలో తొలి మజిలీ. సాహితీముత్యాల కవితామయ హృదయాలను రసిక

ప్రపంచానికి పరిచయం చేయాలని యువభారతి ఉద్దేశం. ప్రజాసమూహంలో చెదరి యున్న సాహితీ చైతన్యాన్ని సమీకరించ వలసిన బాధ్యత సాహితీ సంస్థలది. కనుకనే యువభారతి ఏతాదృశ కార్యక్రమాలను చేపట్టి తన మనుగడను సార్థక పరచుకొంటున్నది. కొంచెం సన్నగా చిన్నగా ఉన్నా 'గోలకొండకవుల సంచిక'లా గోచరిస్తుంటీ కవితా సంకలనం. ఆ సంకలనం తెలంగాణాకు పరిమితమైతే ఇది తెలుగు దేశానికే కాక తెలుగువాణి ప్రసరించిన హృదయప్రదేశానికి విస్తరించినట్లు కనిపిస్తుంది. సాహితీమిత్రులు సృష్టించిన 'ఉషస్సు' ఇలా ఉన్నప్పుడు ముందుముందు సూర్యోదయం మధ్యాహ్నం మనోజ్ఞంగా మహోన్నతంగా ఉంటాయని ఆశించడం అత్యాశ ఏమీకాదు.

యువభారతి రససమాహ్వానాన్ని అందుకొని ఈ స్వాతికోద్యమంలో పాల్గొన్న కవితామూర్తులను అభినందిస్తున్నాను.



# "ఉషస్సు" లో వెలుగులు

23 అలభ్యానందం - పంతప్రగడ శేషమ్మ
24 నవత - మంగళగిరి ప్రమీలాదేవి
25 మాయదారి మాలోకం - వేదవతీదేవి
26 నేను ఏడ్చాను - బి. లక్ష్మాంజలి
27 విముక్తి - కె. సుందరి
28 పోరాటం - బి. ఎ. భానుశ్రీ
29 ఉషాసుందరి - కె. వి. కామేశ్వరరావు
30 ప్రణయోల్బణ - గాదె శంకరయ్య
31 మన్ను తిను - నిష్ఠల వెంకటరావు
32 ఉగాది ఆక్రందన - వి. వి. సత్యప్రసాద్
33 అభినందన - జయ
34 అబద్ధాల అలలు - కూర విశ్వనాథము
35 ఎట్ ది ఏజ్ ఆఫ్ ట్వంటీత్రీ - బి. శ్రీరాములు
36 ముగ్ధ - జయబాబు
37 తెలుగు నాడు - నేడు - తార
38 వాన - వరద - హరిత
39 ఆవేదన - వాసికర్ల రవీంద్ర
40 గులాబి - ఎం. రత్నాకరరావు
41 కొత్తవెలుగు - బాలాంత్రపు శ్యామలరావు
42 కాలచక్రం - మల్లిడి రామమోహనరెడ్డి
43 అంతర్వాణి - జి. ఆర్. కృష్ణమూర్తి
44 నవ్వుతోంది సోషలిజం - డి. వి. శర్మ
45 ఇజం కథ - మధుసూదన్, కె. (సవేరా)
46 కుండ - వి. మధుసూదనరావు
47 సామాన్య (శాస్త్రం) స్వగతం - జోషి లీలన్‌రెడ్డి
48 నేను + నీవు = మనం - గాధంశెట్టి రాజేంద్ర
49 అందరూ విచ్చేయండి - బి. అచ్యుతరాజు
50 సాంధ్యవేళ - జ్వాలా సోమనాథశాస్త్రి

79 అన్వేషణ - జగన్మణి

80 శ్రీశ్రీ వింటే? - చలం

81 నాకు తెలియని నీవు - కె. ఆర్. కె. మోహన్

82 మాట్లాడే మంటలు - ఎ. విజయరామశర్మ

83 అన్నకు .... ఒక విన్నపం - భిన్నూరి అనంతకృష్ణమూర్తి

84 మూగవోయిన రాగభావం - సత్తిరాజు నరసింహారావు

85 అదిగో వచ్చుచున్నది - షైలాక్

86 ఏడుకొండల దొర - ఏడిద కామేశ్వరరావు

87 నీవు జీవించాలి - గంగసాని పద్మారెడ్డి

88 నా ఉగాది - సాలగ్రామ్

89 ఉషస్సంరంభం . టంకసాల గోపీనాథ్

90 మరువీచిక - మరింగంటి లక్ష్మీనరసింహాచారి

91 ఈనాటి యువకుడు - ఎ. పురుషోత్తమరావు

92 సుభాషిణి - నెరయసూరి చంద్రశేఖరం

93 ఆరాధన - రామనాథ కోటేశ్వరరావు

94 తమ్ముడూ! - సున్నా అచ్యుతరావు

95 ఆత్మనివేదన - అత్తోట వాసుదేవరావు

96 జాబిల్లి - తూట తాతారావు

97 అభిసారిక - టి. పి. ఆర్. హనుమంతరావు

98 సుస్వాగతం - మెంటా రామలింగయ్య

99 మీటింగులు - మొక్కపాటి శివాజీ

100 మారుపేరుతో మళ్ళీ వచ్చింది - రేగోటి హరిశంకర్

101 ఇచ్ఛ - కల్యాణి

102 మిధ్యా జగత్తు - మిట్నం రామమూర్తి

103 ఆత్మపరిచయము - విశపు బాలసుబ్రహ్మణ్యం

104 నేను - సూర్యదేవ్

105 మధురస్మృతి - గోదాజాని

106 పదండి ముందుకు - జి. సి. తిమ్మారెడ్డి

107 నేనొక తపస్విని - డి. రాధాకృష్ణరావు
108 రాగలహరి - ఎమ్. కృష్ణమూర్తిరావు
109 దీవెన - జి. వెంకటేశ్వరరావు
110 నాకు స్వాతంత్ర్యం వచ్చింది - కాంచనపల్లి చినవెంకటరామారావు
111 మన ఇంటికి స్వాగతం - నముడూరి శ్రీనివాసు, గూడూరి రామనాథశాస్త్రి
112 ఆడబ్రతుకు - ఎల్. ఎస్. ఎస్. ఆర్. ఎ. శర్మ
113 స్పందన - గుంటి పుండరీకాక్షయ్య
114 నా దేశం - అశ్విని
115 నిన్న - నేడు - అగ్ని
116 మేలుకో - ఎన్. రామస్వామి
117 పాప నమ్మె - ఎల్. కన్నయ్యనాయుడు
118 పాతికేళ్ళ స్వాతంత్ర్యం - తాళ్ళపల్లి మురళీధరగౌడు
119 కవిత - శేరిపల్లి హనుమంతరావు
120 విష్ యూ ఆల్ ఏ హాప్పీ న్యూ ఇయర్ - శ్రీపతి రఘురామ్‌కుమార్
121 మనదేశం బాగుపడే దెప్పుడు ? - వి. సుబ్బరాయశాస్త్రి
122 భాగ్యనగర లేఖ - కె. వి. రాంప్రసాద్
123 అప్పుడు ! - అయ్యదేవర పురుషోత్తమరావు
124 నిరంకుశులు - ఇరివెంటి కృష్ణమూర్తి
125 అలజడి - మాల
126 అంకితం - పింగళి జగన్నాథరావు
127 బ్రతుకులోని తియ్యదనం - వంగపల్లి విశ్వనాథం
128 నేను విద్యార్థిని - టి. కె. విజయకుమార్
119 నా ఎదలో వ్యవసాయం - జీడిగుంట కామేశ్వరరావు.
130 విరజిమ్ముసులే ! - తిరుమల శ్రీనివాసాచార్యులు

* * *

# గురుత్వాకర్షణమా ? లేక ఆకాశ వక్రత్వమా ?

వసంతరావు వేంకటరావు *

సార్వత్రికము గురుత్వాకర్షణమ్మంచు
దూరస్థ చర్యగా, ద్రవ్యలక్షణముగా
వివరించి, సౌరమండలమందలి గ్రహాలు
రవిచుట్టు తిరుగుటను, వసుధ చుట్టును శశియు
నిత్యప్రదక్షిణాల్ చేయుటను, తారకలు
నీలాంబరమునందు నిహిత మార్గాలలో
నిత్యము గమనించుటను, పైకి రువ్వినరాయి
నేరుగా భూపతనమొందుటను, భువిచుట్టు
వాతావరణముండుటను, చంద్రలోకాన
వాతావరణమించుకేని లేకుండుటను,
ద్రవ్యరాశికి దూరమునకున్న సంబంధ
ధర్మముగ, ఆకర్ష బలనిదర్శనములుగ
న్యూటనావిష్కారమని కొందరనుచుండ ;
న్యూటన్ సమాలోచనలు ప్రక్కకునునెట్టి,
అతిబృహద్ద్రవ్యరాశిని చుట్టియున్నట్టి
ఆకాశ కాలావిరతిక♦మే వక్రమై
సుడులట్లు ఆకసము చుట్టుకొనియుండగా
సుడుల చిక్కిన వస్తువులు భ్రమించెడులీల
రవి చుట్టు గ్రహములును, భువిచుట్టు చంద్రుడును
అవసరమ్ముగ తిరుగునైన్‌స్టైన్ ప్రకారమ్ము !
అదె యథార్థమ్మంచు కొంద రనుచుందురట !
దూరస్థచర్య ద్రవ్యాకర్షణము నిజమొ ?
ద్రవ్యావృతాకాశ వక్రత్వమే నిజమొ ?

---

* రిసర్చి ఆఫీసర్, తెలుగు అకాడెమీ. హైదరాబాదు.

♦ Space - time continuem.

## నావికా!

డా॥ వి. ఆర్. శాస్త్రి *

సాగు నావిక! ముందుకూ
ఆగినావిక ఎందుకూ?
కడలి నడుమకు దవ్వుగా దాటి వస్తివి ధాటిగా
ఇపుడు వచ్చినదేమటీ? అటుల కుంగెను నీ మదీ!
పెను తుఫానే రేగినా గమ్యమన్నది మారునా
చిమ్మచీకటి కమ్మినా వెలుగు రాకే పోవునా?
నీకు బాసట కేవలం నిన్ను వీడని ధీబలం
అదిగొ! అద్దరి పిలుపులో మ్రోగెనెవ్వరి వలపులో

## ఉషోరాగం

అదిగదిగో కాసారంలో
ఆకమలం ఎటు నవ్విందో!

కలల అలల ఊయలలూగీ!
తేటి వలపు పాటల తూగీ!
అరుణకిరణ కరముల సోలీ!
తరుణపవను లాలన తూలీ!

నింగినుండి వెలుగుల రేడూ!
తొంగి తొంగి చూచెను ఇపుడూ
నిలువెల్లా పులకించిందీ!
ఓరచూపులొలికించిందీ!

లేత ఎండ బిగికౌగిటిలో
అరవిచ్చిన ఆ కన్నులలో
నును సిగ్గులు పరుగులు తీశాయ్
తొలి వలపుల తావులు కురిశాయ్.

---

* సంస్కృత శాఖాధ్యక్షులు ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

## సౌజన్యమా లేక సంగ్రామమా ?

కందికొండ సూర్యనారాయణశాస్త్రి *

సౌజన్యమున పనులు సమకూరవా ?
మనకు సంగ్రామ మొక్కటే దిక్కా ?
యుగయుగాలుగ సాగి
జగజగాలను ముంచి
పీల్చి పిప్పిగ జేసి
అరచేతిలో మనకు నరకముంచె
మానవా, ఇదినీవు కానవా ?
హిరణ్యాక్షుడు, హిరణ్య కశిపుడు,
రావణాసురుడు, కుంభకర్ణుడు
శిశుపాలుడు, జరాసంధుడు-
వీరలెందరో నురిగిపోయినారు !
పురాణగాథలను నిరాకరించినా,
నేటికాలము కూడ నిజముచెప్పుతున్నదే !
హిట్లరంతటివాడు విరగబడి చచ్చాడు
ముస్సోలినీ మురిగిపోయినాడు
భారతము మనకేమి బోధించెనోయీ !
నరుడొక్కడే కాదు, నారాయణుడు కూడ !
ఏపాత్ర యేతీరు ముగిసిపోయింది ?
సత్య సౌజన్యములె చివరివరకును నిలిచె !
జగదేక మాంద్యుడు, జగత్పిత సమానుడు,
పూజ్యబాపూ మనకు నిత్యపారాయణ కొరకు
సత్య సౌజన్యములనే చాటి చెప్పాడు !
అమర ప్రేమకు నవియె నిలయమన్నాడు !
మానవా, ఇది నీవు కానవా ?

---

* ప్రకాశకులు, ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్-విజయవాడ.

## ఆశాగీతము

వేముగంటి నరసింహాచార్యులు *

గీ॥ చిమ్మ చీకటిరాతిరి రొమ్ముమీద
'మినుకు'మను కన్నెచుక్కలు మనసులోని
వెలుగు తలపుల మాలికల్ మలచి నాకు
అమృతకావ్య సందేశము లందజేయు.

గీ॥ కొండతలనుండి జాజిపూదండవోలె
జారివచ్చెడు సెలయేటి దారలందు
క్రేళ్ళువారెడు మధురసంగీతవాణి
మూగవోయిన నాగుండె మ్రోగజేయు.

గీ॥ తొగరు జిగిమీరు సంధ్యావధూలలామ
పెదవి గిన్నెలో తొణుకు గోర్వెచ్చనైన
రాగమధురస పూరము ప్రత్యహంబు
చేదు బ్రతుకున మాధురుల్ చిలుకరించు.

గీ॥ పూవుపడతి నెమ్మోమున మోసులెత్తు
పరిమళపు సిగ్గుతెరల దొంతరల నడుమ
దళము లిడు చిరునవ్వురేకలు మఱియ
నయన మార్గములో నందనములు నాటు.

గీ॥ స్నిగ్ధ పాటల వర్ణరంజిత ఉషస్సు
స్వర్ణకింకిణుల్ రవళింప వచ్చి, ఇరులు
క్రమ్ముకొను నాదు జీవితరంగమందు
నవ నవానంద కలితతాండవ మొనర్చు.

గీ॥ ప్రకృతిలోని ప్రత్యణువు శోభాప్రపూర్ణ
భావరమణీయమై, నిరాశావిషాద
గీతములు బాడు నన్ పులకింపజేసి,
చేర్చు ఆశాసుఖ స్వర్ణ శిఖరములకు.

---

* అధ్యాపకులు, సిద్ధిపేట.

## ఎడారి బ్రతుకు

రెడ్డి రాఘవయ్య *

నీలిగగనాన వెలసిన తెలివన్నెలమబ్బురీతి
అంతరంగ గగనమందు ఆశలేవొ అలముకొనుచు
అన్ని ఆశలకు "విధి"యను పెనుగాలులు సోకగానె
మబ్బులన్ని వీడిపోయి మిగులు తుదకు నీలిమమే!

కోరుకొన్న ఆశలేవి
తీరనట్టి బ్రతుకుకాగ
సమస్యల తుఫానులోన
చిక్కుకొందు నంతనేను....

సమస్యలను అధిగమించు
సాధనమ్ము నెరుగలేక
భయవిహ్వల చిత్తుడనై
బాధతోడ క్రుంగిపోదు....

తిమిరమ్మును చీల్చివచ్చు తొలివెలుగుల ప్రొద్దువలే
"బాల్య"మనెడు తూర్పునందు పుడమిపైన అవతరింతు
బ్రతుకు బాటలోననడచి "ముదిమి"యనెడు నింటజేరి
తిమిరమందు కలసిపోయి తుదకు నేను అంతరింతు....

ప్రొద్దువలే పుడమిపైన
పుట్టి తుదకు ప్రొద్దువలే
పోవు బ్రతుకు పథమునందు
బాధలను ఎడారి గడచి,

మోడుబారినట్టి ఎడద
మోసులెత్తి చిగురించగ
విరుల వనమునందు నేను
విహరించగ తరుణమెద్ది ?

---

* టెక్నీషియన్, హిందూస్తాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్, హైదరాబాదు.

## నీతిపద్యములు

దరెగోయిని శ్రీశైలం, బి.ఎ., బి.ఓ.ఎల్. *

ఖలుని కెన్నిహితులు గఱపిన నవ్వాని
నెల్లమఱచి నడచు హీనగతిని
ఖరముమేన మంచి గంధంబు బూసిన
బూదియందు మగిడి బొరలు తనయ.

సకల శాస్త్రములను చదివితినని మదిఁ
దలచి విఱ్ఱవీగుఁ దాడి నెక్క
వాని తలను దన్నువారలు గలరని
తెలిసి కొనడు సుంత ఖలుడు తనయ.

ఒరుని తప్పువెదుక నుత్సహింతురు గాని
తాము సేయుతప్పు దలచుకొనరు
దూరి తీగ లాగ డొంకంత కదలదా
పరుల తప్పులెన్న తగదు తనయ.

క్రూర చిత్తునెపుడు చేరదీయగరాదు
చేరదీసె నేని చెడుపెచేయు
పాలుబోసి సతము పామును బెంచిన
నూరుకొనునె కఱవ కుండ తనయ.

మాతృభాష మఱచి మరి వేరు భాషల
నేర్చువారి నియమ నీతులెల్ల
ప్రక్క యింటి పుల్లపచ్చని రుచియని
పలికి నటులెయుండు పడుచు తనయ.

మంది చాలయున్న మాఁటలే మిగులును
పనులుగాక చెడును పనికనంబు.
పాముఁజావ దెపుడు పలు మందిచేతిలో
పాటులేవి నరులు పడుచు తనయ.

---

* తెలుగు పండితులు, ప్రభుత్వ జూనియర్ కళాశాల, నారాయణపేట.

# తెలియరా ! ఓ తెలగువీరా !

రామవరపు సుబ్రహ్మణ్యశాస్త్రి *

తెలియరా !
ఓ తెలుగువీరా !
పలుకరా నీ జాతి
దివ్య చరితమ్ము !!
శాతవాహన కాల సంస్కృతీ సభ్యతలు
సౌమనస్యము తోడి సామ్యవాదము చాటె ॥తె॥

నాగార్జునాచార్య
విశ్వవిద్యాలయము
విలసిల్లె విశ్వాన
విఖ్యాతి వెలయంగ ॥తె॥

యుగ యుగమ్ములనుండి
నీవాడు దేశాన
నింగిలో చుక్కల్లె
వెలుగొందె రమ్యముగ ॥తె॥

నన్నపార్యుని నాటి
మిన్నయౌ నానుడులు
కృష్ణరాయల కీర్తి
కనకాభిషేకాలు ॥తె॥

త్యాగయ్య, పోతయ్య భక్తిభావాలు
జక్కన్న, తిక్కన్న శిల్పసౌందర్యాలు
తెలియరా
ఓ తెలుగువీరా !
పలుకరా నీజాతి
దివ్యచరితమ్ము !!

---

* ఆంధ్ర శాఖాధ్యక్షులు, ఎస్. ఆర్. ఏ. ఎస్. కళాశాల; కొత్తగూడెం.

# "వర్షం"

రావికంటి వసునందన్ *

కలగి కోపవ యగుచు, గగన సుందరి నుదుటి
అరుణ తిలకము గప్ప కురులు విరబోసుకొని,
కంటి ముత్తెములొలుకు ప్రియునిపై సుఖముగా—
ఘన వదనములు గప్పె వనజాప్త బింబమును,
జలబిందువులె చెలగి కురిసెనో,
అవిగాక, ప్రళయాంబుదమువలె వడిమొరసెనో!

కడగండ్ల వనరి, కష్టాల వేడిమి వేగి,
కడుపునకు కూడు, కట్టగ బట్ట కరువైన,
శ్రీహరీ! యని పేదవాడొకడు రోదించ
పొంగి పొరలుచువచ్చి వఱదలై కన్నీరు
పలుగాకిలోకమును ముంచెనో,
అటుగాక, వాని శాపోదకమె కురిసెనో!

లోకనిర్మాత, మెఱుపుల జిలుగువెలుగులో
"తకధిమిం తకధిమిం తకిట ధిత్తై" అనుచు
జలదగర్జారవ మృదంగ నాదము మ్రోయ,
మేఘావనిక వెనుక చతుర తాండవమాడ
సురలు జల్లిన విరుల వానలో,
అవిగాక, మేలిముత్తెపు సేసజల్లలో!

* * *

ప్రకృతి యొక్కటి, దానికున్న గుణమొక్కటియె,
పలుపాట్లబడు ప్రాణులెన్నుదుర పలుతీర్లు!
ఒకడు శృంగారి, వేరొకడయ్యెను విరాగి,
ఒకడు వేదాంతి—అంతములేదు తలపులకు!!

---

* గణితశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

## నా వసంత సుందరీ !

దిలావర్ *

నాగరికతా వికృత నవ్యరూపాల
నీలి నీడలు చూసి, నిందనాపై వేసి
వెనుదిరిగి పోవకే
వాసంత సుందరీ !

కుటిల వ్యూహాలకూ
కఠిన హృదయాలకూ
కలుషితా వర్తాలకూ
కంటక పరివృత జీవన పథాలకు
సుదూరంగా_నీకోసం
హృత్సరోవరాన్ని రసపూరితం చేశాను.

వలపు వలిపమ్ము రసార్ద్రమ్ము కాగా
మున్కలిడి తనివార జలకమ్ములాడు !
ప్రకృతి పులకించి పరవశమ్ము కాగా
బహువిధుల తమిదీర నాట్యమ్ములాడు !

మోడువారిన జీవనోద్యాన వనాన
వసంత సౌరభాలు గుబాళించు !
నిబిడాంధకార నిరాశా విహాయస పథాన
షోడశ కళల పిసాళించు !
మూగవోయిన రస జగాలను మేల్కొల్ప
మోహన వంశిపై రవళించు !
అనవతరము శీర్ణ హృదయాలలో
అమృతధారలను కురిపించు !

* తెలుగు పండితులు; ముత్యాలంపాడు.

## ఆభ్యంతర పరీక్ష

పి. ఎల్. శ్రీనివాసరెడ్డి, ఎం, ఏ. *

సింహం క్రూర మృగమనీ—చీల్చేస్తుందనీ
కాలసర్పం విషపూరితమనీ—కాటేస్తుందనీ
అందరికీ తెలుసు, పసికందులకు తప్ప.
వాటి ఆకారాలు, వాటి బుసబుసలు
బహిర్గతం చేస్తాయి వాటి సహజ లక్షణాలను
కానీ మనిషి ?
అతని వాక్కులు అమృతప్రవాహాలు
అతని దృక్కులు ఆనందనిలయాలు.
అతడు ఎవరు పిలిచిన పలుకు, ఎల్లవారిని పలుకరించు,
ఆర్తులను జూచి అక్కటికమున కన్నీరు గార్చు,
సానుభూతి జూపించు, సాహాయ్యమొనరించు,
నీతులు చెప్పు, తీరుపులిచ్చు.
దగ్గఱున్న వారిని దగాచేయు,
నమ్ముకున్నవారిని నట్టేటముంచు,
కోడిని, కోడి గుడ్డును గుటుక్కున మింగు,
తడిగుడ్డలతో గొంతులుకోయు
ఈ గోముఖ వ్యాఘ్రాన్ని ఎలా గుర్తించడం ?
ఈ పయోముఖ విషకుంభాన్ని ఎలా పసిగట్టడం ?
గోముఖాన్ని ఊడదీసి,
పయస్సును ఒలకబోసి
మామూలుగా చూసేవారికి, పరేంగిత జ్ఞానం లేనివారికి
మనిషి సౌమ్యంగానే కనిపిస్తాడు.
అసలుమూర్తి గుర్తింపబడాలంటే
ఆభ్యంతర పరీక్ష అవసరం మఱి.

---

* రిసర్చ్ స్కాలర్, తెలుగుశాఖ, పి. జి. సెంటర్; అనంతపురం.

## రావమ్మా ! దీవించ ప్రమాదీచా !

"ప్రత్యూష" *

అమ్మా ! ఉగాదీ ! రావమ్మా ! రా !
అవిగో !
నేలపైకి లీలగా వ్రాలిన నీలాకాశపు ఛత్రాంచలాలపై
రమణీయ ప్రాకృతిక దృశ్యాల సోయగాల ఎంబ్రాయిడరీల
స్వాగత ప్రభలు వ్రేలాడు తున్నాయి !
అవిగో !
గున్నమావులు! ప్రకృతి యావత్తూ
నిద్రమత్తువదలి, వసంతస్నానం చేసిందని;
చైతన్య శోభాలలితమై; ధరాప్రాంగణం విలసిల్లు తోందని,
చాటేందుకు చిహ్నంగా, బంగారు సుమాలు శిరంనిండా తురిమి
విరగబడి నవ్వుతున్నాయి ! తమ సునులేత చిగురు జొంపాలు,
కోయిలమ్మలకు ఉయ్యాల జంపాలలుకాగా, మైమరచి
కమనీయ ఆహ్వానగీతికల, నాలపిస్తున్నాయి !
ఏదో అపూర్వసందేశం తెచ్చావని! తప్పకమరో క్రొంగొత్తయుగానికి శ్రీకారంచుడతావని!
రావమ్మా ! రా !
పరీధావిలో పొందిన వైఫల్యాల భీకర స్వప్నాల,
గత తమోమయ నిశీధిలో పూడ్చి, ప్రగతి భవిష్యన్మందిరానికి
వెలుగుబాటలు పరచ రావమ్మా ! ప్రమాదీచా !
ఇది అనిర్వచనీయానందకాలం !
పరీధావి వీడ్కోలు నిశాకాలంగతించి,
ప్రమాదీచాహ్వాన మహోదయం ఏతెంచే శుభకాలం !
ప్రముదితులై నీ కుమారులు ప్రేమానురాగాల మణిహారాల
విశ్వమాతగళాన అలంకరించేందుకు, అగ్రగాములు కావాలని
రావమ్మా ! దీవించ ప్రమాదీచా !

---

* జె. దేవప్రియుడు, జిల్లాపరిషదున్నత పాఠశాల; ముత్యాలంపాడు.

# ఉత్తరం !

వడ్డేపల్లి కృష్ణ *

ఉత్తరం !
ఎదలోని ప్రతి కదలికను
పదిలంగా అందించేది ఉత్తరం
పారవశ్యంలో పరుగెత్తించేది ఉత్తరం.
ఎక్కడోవున్న మిత్రుణ్ణి
ప్రక్కనే నిలిపి, పలకరించేది ఉత్తరం.
పలువురితో పరిచయం కలిగించేది ఉత్తరం.
ఎక్కడెక్కడికో ఎగిరిపోయిన జీవితాలను
ఒక్కచోట చేర్చి, ఓదార్చేది ఉత్తరం.
సంతానంకై, సంపాదనకై; దూరంగా
సాగిపోయిన భర్తబాగోగుల నెరిగించేది ఉత్తరం.
మదిలో మధురానుభూతుల చిలికించేది ఉత్తరం.
ఎదిగిన కొడుకు ఉద్యోగరీత్యా
ఏ దేశం వెళ్ళినా, ఏ వేషం వేసినా
అన్నీ కన్నవారికి విన్నవించేది ఉత్తరం
మోదమైనా, ఖేదమైనా
మొత్తానికి సమస్తం వివరించేది ఉత్తరం.
మాటల్లో మాదిరిగా తడబాటు లేకుండా
మధురంగా మాట్లాడేది ఉత్తరం.
మనిషిమనిషినీ, మనసుమనసునూ పెనవేసి కలిపేది ఉత్తరం.
పెదవి విప్పకుండానే విషయాన్ని తెలిపేది ఉత్తరం.
తుదకు నూతన సంవత్సర శుభాకాంక్షలూ పలికేది ఉత్తరం.
అలా ఉత్తరంలా అనేక ప్రయోజనకారి కావాలి, మానవుడు.
అప్పుడే అవనిలోనే అగుపిస్తాడు దేవుడు.

---

* సబ్ పోస్టు మాస్టర్, బోయినపల్లి; కరీంనగర్ జిల్లా.

# మనిషి దేవుళ్ళు

వేముల ప్రభాకరుడు *

దేవుడు మనుషుల్ని చేస్తాడో, లేదో ?
దేవుడెరుగు !
మనుషులే, మనిషిని దేవుణ్ణి చేస్తారు.
లేని మహత్మ్యాలు కట్టబెట్టి
గుడిపూజ చేస్తారు.
అడిగిన వరాలివ్వన్నాడు "మనిషి దేవుణ్ణి"
అడుగడుగునా దూషిస్తారు.
నిన్న బలవంతంగా అంటగట్టిన దైవత్వాన్ని
నిర్దయగా ఖండిస్తారు.
మనిషిగానైనా ఉండనీకుండా
అమానుషత్వం అంటగడతారు.
నిన్నటిదాకా కొలిచిన "మనిషి దేవుని" బొమ్మల్ని
నిలువునా కొట్టేస్తారు.
చెప్పిన నీతులు బూతుల
కూతలుగా దులిపేస్తారు
మరో "మనిషి దేవుని"కై
మనసులను మళ్ళిస్తారు.
సినిమా తారల్లా, తారాజువ్వల్లా
"మనిషి దేవుళ్ళు" మనిషికి కాస్సేపు
ఓ వెలుగు వెలిగి వెళ్ళిపోతారు.
అయినా, విసుగులేని విక్రమార్కుడిలా
వెలిగించే మనుషుల్తో
వెలిగిపోయే వారితో
ప్రజాస్వామ్యం నత్తినడక సాగిస్తోంది.

* ఆంధ్రప్రదేశ్ స్టేట్ కో-ఆపరేటివ్ మార్కెటింగ్ ఫెడరేషన్, లి., హైదరాబాదు.

## ఉగాది లక్ష్మీ ! స్వాగతం

"మధుకరి" *

కాసిరి పొగ మబ్బులలోన కాంతి చెదరె
కమ్మని కాంతి కిరణాల కాంతులడరె
తరుణ భానుని క్రాంతి రథమ్ము వెలుగొందె
కర్కశమైన ఇడుమల ఇరులు దిగులొందె.
శుక, పిక, కోకిలమ్మలు గళములు సవరించెను
మావిగున్న-మంచిముత్యముల విరులుబూసెను,
నీ ప్రాంగణమ్మున వటకన్య పవడ దివ్వెలెత్తెను
నీ ముంగిటిలోన కలువకన్నె ముగ్గులు పెట్టెను.
నీ పాదరజము సోకినంతనె
విశ్వములోన అచేతనత్వమడుగంటెను ;
నీ దయాపాంగ వీక్షణమ్మొందినంతనె
చైత్రరథము జైత్రయాత్రకు వెడలనడచెను.
సుఖ దుఃఖపు చక్రమ్ముల గమనములోన
జీవిత రథము ప్రగతి పథము పట్టునంచు
క్రమ కటుకషాయంపు పచ్చడి ప్రసాదమ్ముల
జగతిలోని జనులందరు పరితృప్తిగ భక్షించిరి.
యువభారతిలోని సాహితీమిత్రులందరు
అవిగో-అజ్ఞాన తిమిరభంజనకై చిరుదివ్వెల వెలగించిరి
ఆ వెలుగులోని తెలుఁగు జాడలెఱిగి నీవు
తడబడక నడచిరమ్ము ; వడివడిగా నడచిరమ్ము.
ఓ "ప్రమాదీచ" ఉగాది లక్ష్మీ ! స్వాగతం
మాప్రమోద జనయిత్రీ ! నీకు సుస్వాగతం, ఇక
ఆ-గతంలోచి అవరోధాల అగాధాల్ని విస్మరించు
ఆ గతంలోని ఆనందాల గాథల్ని స్మరించు

---

* విద్యార్థి, ధర్మపురి; కరీంనగర్ జిల్లా.

## ఆస్తికుడు - నాస్తికుడు

కె. జి. రాంప్రసాద్ *

ఆస్తిక నాస్తికుల ప్రవచనం తర్క-వితర్క ప్రభంజనం
కావాలా? ఆ తర్క-వితర్క సంకలనం-
వ్రాయాలా? ఆ అవిరుద్ధ మిథ్యావిలాసం!
గగనసీమలో గమ్యమెరుగని జలరేణువు చినుకై నేలకొరిగి
అంబరచుంబిత శిఖరాల అంచుల్లోజారి
అఖాతంలోని కురికే జలపాతమై, పచ్చికమీద పరువెత్తి,
మైదానాలమీద మత్తుగా నడచి,
సాగరంలో సంకలనంపొందే నదీమతల్లి గాథ
ఆస్తికునిమదిలో ప్రత్యగాత్మ-పరమాత్మల సమైక్యతా సారాన్నివలికిస్తుంది.
నాస్తికునికది వట్టి ఋతువు గారడీవిన్యాసంలా వికసిస్తుంది.
వెలుగునీడల వెక్కిరింతల్లో అణువణువున అహర్నిశలు
ఆవిర్భవించి, స్థితిలయకారకుడైన చైతన్యమూర్తి
విరిసినపూవులో తావియై, పరుగిడేనదిలో ఉదకమై
రాయై, రప్పై, చలనాచలనమైన అనంతశక్తికి
ఆస్తికుడు భక్తితో పెట్టుకున్నపేరే భగవంతుడు.
బుద్ధి వికాసానికి బద్ధుడౌతాడు నాస్తికుడు.
తర్కం నాస్తికుని గుప్తధనం
వేదాంతం ఆస్తికుని అమృతమయ ప్రాణం.
దేవుణ్ణి చూపమనేది నాస్తికవాదం.
జ్యోతిర్మూర్తిని అంతర్ముఖంగా కాంచమనేది ఆస్తికవాదం.
అందుకే ఆస్తికనాస్తికుల ప్రవచనం యుగయుగాల ప్రహసనం.
అయినా ఆస్తికుడంటాడు-సర్వం భగవత్ స్వరూపమని
నాస్తికుడంటాడు దాన్నే వ్యర్థభావమని!

---

* పోస్టల్ ఆడిట్ ఆఫీస్; హైదరాబాద్.

## ఈశ్వరా!

అందె వేంకటరాజము *

శ్రీమద్విశ్వవిరాట్స్వరూప! భువనక్షేమంకరోద్యోగ! ది
వ్యామేయాప్రతిమప్రభావ! పరమేశా! సచ్చిదానంద మూ
ర్తీ! మూర్తిత్రయ మూలకారణలసత్తేజా! కృపాబ్ధీ! పరం
ధామా! నిన్ శరణందు జన్మము కృతార్థంబౌటకై యీశ్వరా!

తమి వాగీశ్వరిఁగొల్వ నత్తయగు పద్మాదేవి కోపించు నా
యమ నాసక్తి భజింపఁ గోడలిమనం బారాటమున్ జెందు, సా
మముగా నిద్దరఁదన్న నిన్గొలుతు సుమ్మా! దేవదేవేశ! మూ
లము నేకమ్మొనరింపఁగొమ్మలవి యెల్లన్ వెల్గవే యీశ్వరా!

నిను బూజించుచుఁ బాపకార్యములలో నిర్మగ్నులౌవారు పా
యని దుర్వ్యాధికి మందువాడుచు నపథ్యాహారులౌవారు, గం
గను దాఁటన్ బెనునావ నెక్కి మునుఁగంగన్ రంధ్రముల్ సేయు వా
రౌనగూడన్ గలదేమి దీనికి విపద్వ్యూహంబుగా కీశ్వరా!

భువిలో నంగబలంబొ యర్థబలమో పొల్పొంద నత్యంతమై
భవదీప్తిన్ వెలువొందువారిఁ గొలువన్ బాటింతురేగాని యె
క్కువ విద్యాబలమున్న వారిఁగొలువన్ గోరంగలేరీ జనుల్
శివునిన్ గేశవుఁగాక బ్రహ్మనెవరేన్ జింతింతురే యీశ్వరా!

వణిజుం డంగడిఁదీసి నిత్యము నినున్ బ్రార్థించి యాపై నదే
పనిగా బేరములందు మోసమొనరింపన్ సాగి పాపావళుల్
ధనరాశుల్ గడుఁగూర్చి మ్రొక్కుబడు లందంజేసి నీ పేరు ని
ల్పున ముంచున్ బహువృత్తు లిట్టివె యెటుల్ చొక్కంబులౌ నీశ్వరా!

విద్యుత్తంత్రుల నెందుఁగన్పడక తద్విద్యుత్ప్రవాహంబు తా
నాద్యంతంబు నెసంగి 'స్విచ్చరున' నెందైనన్ స్ఫుటం బౌగతిన్
విద్యోతుండవు గాక ప్రాణితతికిన్ విశ్వంబునం దెల్లెడన్
సద్యః ప్రస్ఫుట మౌదు భక్తిజనితజ్ఞానంబుచే నీశ్వరా!

---

* ఉపన్యాసకులు, ప్రభుత్వ జూనియర్ కళాశాల, కోరుట్ల; కరీంనగర్ జిల్లా.

# "మనిషే నా దేవుడు"

చంద్రముఖి వేణు *

కామక్రోధ మదలోభ సర్పదష్టులం
ఓ భగవాన్ నీవే మతంవాడివో నాకక్కరలేదు
ఓ భగవాన్ నీవే ధర్మంకోసం
జన్మలెత్తావో నా కనవసరం.
రాం రహీమ్ ఏసుప్రభువుల్లో
ఏ మత శిల్పాల్లో ఉన్నావో నా కనవసరం
గీతా ఖురాన్ బైబిల్ గ్రంథాల్లో
ఏ నీతి సూక్తుల్లో నక్కి ఉన్నావో నాకనవసరం
ఏసుగా ఏ ధర్మంకోసం సిలువమీద బలి అయ్యావో
మహమ్మదుగా ఏ నీతికోసం సంఘంచే బహిష్కరింపబడ్డావో
రాముడిగా ఏ ధర్మంకోసం అడవుల్లో ఆలితో తిరిగావో
బుద్ధుడుగా ఏ ధర్మంకోసం ఆలుసంతుల వదిలావో
అవన్నీ నాకప్రస్తుతాలిప్పుడు-అయితే నేనిప్పుడు
ఏ మానవతా దీపాలు ఆర్పుకొని నీముందు దీపం వెలిగించాలి ?
చీకటిలేని వెలుగులో ఏదీపం వెలిగించాలి ?
ఏనాడో మానవతా స్వరూపానికి మోకరిల్లిన నేను
నీ ముందెందుకు "శిర్దా" వంచి నమాజుచేయాలి ?
ఏనాడో నాలోని చెడుకు సిలువవేసిన నేను
ఈనాడు నీ సిలువముందు తలవంచడం దేనికి ?
అలా అని నేను నాస్తికుణ్ణి కాను.
మమతా సుమాలు చల్లి మానవత్వాన్ని కొలుస్తాను.
మానవత్వం ఉన్నప్రతి మనిషీ నాదేవుడు
కరుణోదయ కిరణాలే నా జీవదోదయ రేఖలు.

---

* ఎల్. డి. సి., ప్రభుత్వ ఉన్నత పాఠశాల, చాదర్ ఘాట్; హైదరాబాదు.

## సంఘర్షణ

"రంగినేని" *

ఓ తిమిర రూపమా
ఓ హృదయ శల్యమా
ఎదిగి ఎదగని నన్ను
అదర గొట్టెద వేల ?
నీ కల్మషత్వమ్ము
నీ కుటిలతత్వమ్ము
చీల్చి సత్యము చూచి
గెల్చు "శక్తి"యు గలదు.
నీ నిశాచర శక్తి
నీ వికృత భుజశక్తి
చూపి నను బెదిరించి
చూత మనుకొంటివా ?

నా శాంతి కాముకత నా జ్ఞాన కిరణాల
"స్ఫూర్తి" నినుగాల్చి ధర సువ్యవస్థితి నిలుపు.
నీదు పిడి వాదమున నాదు భావన నంత
చంపి వేయాలంచు సాగి వచ్చెదవేల ?

నీదు నీచత్వమ్ము
నీదు దంభత్వమ్ము
పారద్రోలెడు "వ్యక్తి"
ప్రతిభ నాలో ఉంది.
నా ధ్యేయ జీవనము
నలిపి వేయాలనే
నీ ప్రభంజన శక్తి
నిదుర పుచ్చెద "యుక్తి".

---

* సుబ్రహ్మణ్యం, ఉపాధ్యాయులు, ప్రాథమికోన్నత పాఠశాల, వెల్టూరు; మహబూబ్‌నగర్ జిల్లా.

## గురివింద

అష్టకాల నరసింహారామశర్మ *

విష్ణ్వంశ సంభూతులారా! నాయకోత్తంసులారా!
అమాయిక దేశనారికి ఉల్లిపొరల పుస్తెకట్టి ఊరేగే ధీమంతులారా!
సామాన్యుడి ఆశలకూ అదృష్టానికీ మధ్య
సాలెగూడు వంతెనల్ని కట్టొద్దు.
నిరాశా నిస్పృహలు పానీయంగా నిద్రాహారాలు లేక అలమటించే
నికృష్టుడికి ఎండమావుల సినిమాలు చూపించొద్దు.
చేసే మోసాలకు ద్రోహాలకు న్యాయమనే ముసుగు కప్పొద్దు.
కర్కశ కఠినాత్మ తత్వాలకు నిబిడ నిరంకుశత్వాలకు
దేశసేవ నామం దిద్దొద్దు.
కుత్తుక నిండిన క్రూరత్వానికి పండిన గుండెల పాపానికి
అమృతభక్షణ అని అబద్ధాల లైసెన్సులివ్వొద్దు.
కలుష తత్వాన్ని కడుపులో దాచి
ఎదుటివాడి కళ్ళకి తారు పూయొద్దు.
అగాధాన్ని ప్రమాదాన్ని రంగుటద్దాల్లోంచి చూపొద్దు.
నడుం నిండా గజ్జిని
అత్తరుతో నింపొద్దు అంబరంతో కప్పొద్దు.
ఎంతకాలం దాస్తారీ దురాశా దుర్గంధాల్ని ?
ఎంతకాలం, మూస్తారీ హీనతాగుణధూమాన్ని!
మీ తప్పులు దాచుకొని ఎదుటివాడి
చీమకాలంత తప్పుల్ని దుర్భిణీ అద్దంలో చూడొద్దు
మెజార్టీకి పావర్టీ వస్తేగాని పక్షపాతానికి పక్షవాతం వస్తేగాని
మీ జీవితాకాశంలో తోకచుక్కలు పొడిస్తేగాని
మీ దురాశా భూతలంలో కంపం వస్తేగాని
మీ యభివృద్ధి సముద్రంలో తుఫాను వస్తేగాని
దేశం బాగుపడుతుందని కలగనడం కలగనడమే అవుతుంది.

---

* తెలుగు పండితులు, జిలా పరిషదున్నత పాఠశాల, వెల్కటూరు; మెదకు జిల్లా.

## జగతి మారాలి

"విజయ" *

చిరిగిన గుడ్డలతో నిలువనీడలేక
తినడానికి తిండిలేక ప్రొద్దంత చేయిసాచి
ఇల్లిల్లూ తిరిగితే దొరికిన దానితో
కడుపు నింపుకోలేక,
ప్రకృతి ఆర్భాటాలకు తలవంచి నిలబడే
రక్షణ రహితులొకవైపు
పేరుకు మాత్రం ఉద్యోగం చేస్తూ లభ్యమైన ఫలితం
అవసరాలు తీర్చలేకపోగా
అతిథి మర్యాదకై అప్పులు చేస్తూ
ఆచారాలు వేసేసంకెళ్ళకు లోబడి
ఆడంబరాలను విడనాడలేక క్రుంగిపోతున్న వారొకవైపు
ధనార్జనే ధ్యేయంగా నిలిపి పరిశ్రమల స్థాపించి
కార్మికుల కృషి ఫలితాన్ని బీరువాల్లో దాస్తూ
బ్లాక్‌మనీ ప్రోగు చేస్తూ ప్రభుత్వమునకు పన్ను ఎగవేస్తూ
డబ్బుకొని తెచ్చే సుఖాలు తమ మిత్రులని భావిస్తూ
రేబవళ్ళు వానితో చరించు వారింకోవైపు
ఈ మూడు తరగతులు కనీసం రెండుగానైన మారినప్పుడె
ఆందోళనలు అంతరిస్తాయి. అరాచకాలు అడుగంటుతాయి.
స్వార్థం సమసిపోతుంది శాంతిలతలు చివురిస్తాయి
అందుకే అంటున్నాను నేను
ఈ మూడు తరగతులను ఏకీకరణ చేయడంలో
వీలయినంత సమత జగతియందు పంచబడాలని
ప్రతి మనిషీ తన కనీసపు అవసరాలు తీర్చుకోగలగాలని.

---

* ఎమ్. గంగాధర్, బాంబే క్లాథ్ స్టోర్, ధర్మపురి, కరీంనగర్ జిల్లా.

# జీవితం

శ్రీపతి కామేశ్వరి *

జీవితం_జీవితం_జీవితం
కష్టసుఖాల సమ్మేళనం జీవితం
బాల్య, యౌవన, వృద్ధాప్యాలు జీవితం
ధనిక_పేదవర్గ భేదమే జీవితం
జనన మరణాల కలయిక జీవితం

* * *

బిజీ! ఒకటే బిజీ!! లైఫే పెద్ద బిజీ!!
జానెడు పొట్టకే(?) ఈ హడావిడి!!
సూర్యోదయం నుండి త్రిసంధ్యలలోనూ
మూడు కాలాలలోనూ ఒకటే హడావిడి.
పిల్లలు_ఉద్యోగులు; కర్షకులు_కార్మికులు;
డాక్టర్లు_యాక్టర్లు; ఒకరేమిటి? అందరికీ హడావిడే!
విద్యాలయాలు_కార్యాలయాలు; పంటపొలాలు_ఫ్యాక్టరీలు
ఆస్పత్రులు_స్టూడియోలు; రైళ్ళు_బస్సులు అన్నిట్లోనూ హడావిడే!
నిత్య జీవితావసరాల వెతుకులాటకు హడావిడి.
పాలు_పంచదార; 'గేస్'నూనెల సంపాదనకై హడావిడి!!
ఈ జీవితమే ఒకహడావిడి!

---

* సాహిత్యాభిలాషులు, విద్యానగర్, హైదరాబాదు.

## యుగాది

"తాయారు" *

నా మిత్రుడొకడు
నన్నుగాది కవిత
రాయమన్నప్పుడు
నా కనిపించింది
ఇది ఉగాదికాదని
ప్రజా పోరాటాల యుగాదని.
ప్రజాపోరాటం
'పరీధావి'లో
పరాజయం పొందినా
'ప్రమాదీచ'లో ప్రమాదం తెస్తుందని
ప్రజావ్యతిరేక నాయకులకు
సమాధి కడుతుందని.
పోరాటాలవృక్షం
ఆకులు రాలినంత మాత్రాన
కాదది దానిఅంతం.
తిరిగి మరింతగా
విరగబూయడానికది సంకేతం.
రాలిన ప్రతిఆకు వృధాపోదు
నిరంకుశపాలకులకు
నిరంతరం సమాధికట్టడమే
వాటి అనితరధ్యేయం.
అందుకే ఇది ఉగాదికాదు
ప్రజా పోరాటాల యుగాది.

---

* శ్రీమతి ఎ. గంగాదేవి, హైదరాబాదు.

## అలభ్యానందం!

శ్రీమతి పంతగడ శేషమ్మ *

సూర్యునిలా చంద్రునిలా
సుదూరమైన చుక్కలా
అటులే అచటే
అందకుండా నీ వుండుట
ఆనందం. నా కానందం!

* * *

చేతికందని కొమ్మచివర
లేతచివురుల తళుక్కులాగ
పందిరిపై అందరాని
పరిమళించు మల్లియలా
అటులే అచటే
అందకుడ నీవుండుట
ఆనందం! నాకానందం!

* * *

గిరులపైన మేఘములా
విరులపైన తుహినములా
అడవిలోని హరిణములా
కడలిలోని కెరటములా
అటులే అచటే
అందకుండ నీవుండుట
ఆనందం! నాకానందం!

* * *

కొలనులోని పద్మములా
కొండమీద కోవెలలా
కోవెలలో దేవునిలా
కోర్కెతోడ గరువముగా
అటులే అచటే
అందకుండ నీవుండుట
ఆనందం! నాకానందం!

---

* అధ్యాపకురాలు మరియు ఉపాధ్యాయుల సంఘం అధ్యక్షురాలు, ఏలూరు.

## నవత

కుమారి మంగళగిరి ప్రమీలాదేవి *

మతమన్నది లేదుమాకు
మమతన్నది ఎరుగమసలు.
ఇదే మా నవత
మానవతలోని నవత.

బాపూ,
'ధర్మంచర' అని చెప్పినది
గుర్తున్నది మాకింకా.
ధర్మం పాతదే
వద్దు దానిజోలి మాకిపుడు.
అందుకే, స్వీకరించాము 'చర'ను
ఆచరిస్తున్నాము నీ ఉపదేశాన్ని
చరిస్తున్నాము దేశదేశాలు
పని ఉన్నా లేకున్నా
'సత్యంవద' అన్నది నీ ఉక్తి,
అది అసలే పాతది.
గతమంటే మాకు రోత

అందుకే,
ఎన్నికలముందు ఎందరిముందు 'వద' రొదచేసినా
అన్నీ చేయాలా ఈనాడు.

శుద్ధమైన మనసుతో, సుంత మేలు చేయువాడు
కనిపించడు కాగడాలేసి వెదికినా.

బాపూ, నీవే మనుకొన్నా,
పరులేమనుకొన్నా, ఫరవాలేదు మాకు.
'ఆత్మాదేశం' మా ఆయుధం, అది ఆ పరమాత్ముడిచ్చిన గొప్పవరం.

---

* ఉపాధ్యాయిని, బాలికోన్నత పాఠశాల, రేపల్లె; గుంటూరు జిల్లా.

# మాయదారి మాలోకం

వేదవతీదేవి *

ఎలా వచ్చిపడ్డానో ఈ మాయాలోకంలోకి,
ఎందుకు వచ్చిపడ్డానో ఈ మాయదారి లోకంలోకి ।
అందుకోలేని నీలాంబరం ఉంది అల్లదిగో అక్కడ,
అగాధాలు తెలియని పాతాళం ఉంది ఇల్లిదిగో ఇక్కడ ।
నేనటు ఆకాశంపైకి తేరిపార చూడలేను,
చూడాలని ఉన్నా, అంతదూరం నాకు చూపానదు కనుక చూడలేను ।
నేనిటు పాతాళంలోకి తొంగి చూడలేను,
చూస్తే నా ప్రెస్టేజీకి భంగం కనుక చూడాలని ఉన్నా చూడలేను ।
కట్టుకున్న పెళ్ళానికి కట్టుకు పోయినన్ని ఆశలు ।
కట్టుకోవటానికీ చుట్టుకోవటానికి కావాలని అంటుంది బనారసులు ।
దాన్నీ నన్నూ కట్టిపడేసి వేలంవేసినా, రాలదు ఒక కాసు ।
ఆడదానికి ఎంతచెప్పినా ఏమి తెలుస్తుంది తిరకాసు ।
మా బాస్ వస్తాడు కారులో షికారు వచ్చినట్లు ఆఫీసుకు,
మా బంట్రోతు వస్తాడు కాలినడకను హుషారు తెచ్చుకుంటూ ఆఫీసుకు ।
నేనుమాత్రం వస్తాను పంక్చరుపడిన సైకిల్ త్రోసుకుంటూ ఆఫీసుకు ।
ఫైళ్ళకట్టల్ని ఆర్డరులో పెట్టుకుంటూ ఉస్సురంటూ ఆఫీసుకు ।
ఎలా ఉంటుందో కూర్చుని చూడాలని ఉంటుంది నాకు ఆఫీసరు కారు మెత్తమీద
కోరిగ్గా ఉంటుంది ఆఫీసరుకు వచ్చే పంకాగాలి మలయానిలంమీద ।
ఇంతచెప్పినాక, ఇహ మీ ఊహకు వదిలేయమంటారా ?
నా పుట్టుపూర్వోత్తరాలు మీకు విప్పి చెప్పేయమంటారా ।
చెప్పుకుంటే చాలా ఉంది దౌర్భాగ్యానికి
ఇంకా దాచడమెందుకు ఈ పాటిభాగ్యానికి ।
నేను భూమి అంతటా నిండి ఉన్నవాడిని.
నేను మధ్యతరగతివాడిని, మహామంచివాడిని ।

---

* సాహితీప్రియురాలు, మెహదిపట్టణం హైదరాబాదు.

# నేను ఏడ్చాను

కుమారి బి. అజ్మాంజలి *

ఏడ్చాను ఏడ్చాను, నేను ఏడ్చాను ఏడ్చాను
పృథివిపై పడిన క్షణాన జాలిలేని ఓ భగవాన్
పాడుపడిన భువికి నన్నెందుకు త్రోస్తున్నావని
కేరుకేరున ఏడ్చాను. ఆకలి వేస్తున్నసమయాన,
అమ్మ పాలివ్వని సందర్భాన, నోటితో చెప్పలేక గుక్కపట్టి
ఏడ్చాను పసితనంలో. మాటలు వచ్చాక అందరిలా
క్రొత్తగుడ్డలు కట్టుకోలేదని, పొయ్యిలో పిల్లి లేవనిరోజు,
ఆకలితో అలమటిస్తూ, అమ్మ కన్నీళ్ళు కారుస్తూ,
వేడి నిట్టూర్పు విడిచిననాడు. ఓకంట తడిపెడుతూనే
అమ్మకళ్ళు తుడిచాను. చెల్లి పుట్టినరోజు,
అమ్మ ఒడిని దూరంచేసినరోజు, ఏడ్చాను నన్నెత్తుకోమంటూ.
స్కూలుఫీజు కట్టలేక బడి మానేసినరోజు,
అమ్మ మంచానపడ్డరోజు, ఏడ్చాను ఎటూతోచక.
మనసుకు సంకెళ్ళు వేయలేక, కళ్ళెంలేని గుర్రంలా కోర్కెలను
పరిగెత్తనీయలేక, కలలు కనలేక, కన్నకలలు
కల్లలౌతుంటే చూడలేక, రోదించాను యుక్తవయస్సులో.
అత్తబాధ పడలేక ఆడబిడ్డ పోరు పడలేక
శ్రీవారి అలక తీర్చలేక మామగారి సణుగుడు వినలేక
కుమిలి కుమిలి ఏడ్చాను. ఆశయాలు కనుగుణంగాకాక,
పదిమంది పిల్లల్ని కన్ననాడు. జీవితం యంత్రంగా మారిననాడు,
పిల్లల భవిష్యత్ ఆలోచించిననాడు ఎముకలగూడులా వెళ్తున్న
మావారిని చూసినపుడు నిట్టూర్పులో వెళ్లగక్కును నా
హృదయంలోని ఆవేదనని.

---

* విద్యార్థిని, ఉస్మాన్‌పుర, హైదరాబాదు.

## విముక్తి

కుమారి కె. సుందరి *

చేసాడు భగవంతుడు నన్నొక చదరంగపు పావుగా,
ఆడుతున్నాడు నా జీవన చదరంగంలో!
చేశాడు నన్నొక పాత్రధారిగా అంతంలేని నాటకరంగంలో
ఆడిస్తున్నాడు నన్నొక ఆట బొమ్మలా.
ఆడుతున్నాడు నా జీవన ప్రవంతితో!
జీవించాలనే ఆశఉన్నా జీవితంలో ఏదో లోపించినట్లు
కావలసినది ఏదో లేనట్లు, బ్రతకవలసినది ఏదో చచ్చినట్లు
నడవ వలసినది ఏదో ఆగినట్లు
అన్నిలోపాల కలసి కట్టుగా తయారైంది జీవితం!
తింటానికి తిండి దొరక్క ఆకలితో అలమటిస్తుంటే,
తిని జీర్ణించుకోలేక అజీర్తితో అఘోరిస్తున్నారు కొందరు.
కట్టుకోవటానికి బట్టపీలికైనా లేక బాధ పడుతుంటే
"నాగరికపు" పేరుతో నగ్నంగా నవ్వుల పాలవుతున్నారు కొందరు.
తలదాచుకోవటానికి తడికల కొంపైనా లేక తంటాలు పడుతుంటే
రంగురంగుల మేడల్లో నాట్యాలాడుతున్నారు కొందరు.
మమతా మానవత్వాలను మట్టిపాలు చేస్తూ
దానవులుగా తయారవుతున్నారు మానవులు!
శాంతిలేని నా మనస్సు ప్రశాంతిని కోరుతూ ఏ దూరతీరాలకో పారిపోదామంటుంది
ఒంటరిగా బ్రతకనివ్వని ఈలోకంనుండి ఎక్కడికీ పారిపోలేక
బూడిద కాకుండా కాలుతున్నాను. సభ్యత ముసుగులో ఉన్న అసభ్య సమాజంలో
ఆదర్శాలు పాటించలేక, ఆశయాలు నెరవేర్చలేక
ఆత్మవంచనతో అల్లాడిపోతున్నాను.
జీవిత యుద్ధరంగంలో పోరాడి పోరాడి అలసిపోతున్నాను.
ఇక బ్రతకలేను సమాజమనే శ్మశానంలో
ఇక నలిగి పోలేను రాబందుల్లాంటి నరుల కబంధ హస్తాలలో
ఇక జీవించలేను జీవితపు బందిఖానాలో, అందుకే ఎదురుచూస్తున్నాను
భగవంతుని పిలుపుకొరకు నా విముక్తికొరకు.

---

* విద్యార్థిని, ఉమర్ బిల్డింగ్స్, కాచిగూడ, హైదరాబాదు.

# పోరాటం

కుమారి బి. ఏ. భానుశ్రీ *

యుద్ధాలు లేనిదే చరిత్రలేదన్నాడొక చరిత్రకారుడు
శాంతికోసం యుద్ధం మానమన్నాడొక శాంతికాముకుడు
న్యాయంకోసం రక్తపాతం జరిగితీరాలన్నాడొక విప్లవకారుడు
విప్లవంతో ప్రగతిని సాధించలేమన్నాడొక అభ్యుదయకారుడు.
అన్నిటిని కాదని అంతులేని ఈ జీవనసాగరంలో
నిరంతరం జరుగుతునే ఉంది ఆశ(యా)ల పోరాటం
మనిషికి మనిషికి మధ్యపోరాటం
మనిషికి మనసుకు మధ్య పోరాటం
మనిషికి మంచికి మధ్య పోరాటం
మనిషికి మానవత్వానికి మధ్య పోరాటం
రాజ్యాలకోసం పోరాటం
పదవులకోసం పోరాటం
మగువలకోసం పోరాటం
మధువులకోసం పోరాటం
న్యాయంతో పోరాటం
ధర్మంతో పోరాటం
నీతితో పోరాటం
నవ్యతతో పోరాటం
సంఘంతో పోరాటం
నాగరికతతో పోరాటం
పరిస్థితులతో పోరాటం
నిత్యచంచలమైన ఫ్యాషన్లతో పోరాటం.
అణువణువున ఆశ(యా)లు ఫలించని దీనత్వంతో
నిరంతరం జరుగుతూనే ఉంది ఆకలిచావుల "పోరాటం".

---

* విద్యార్థిని, అఫీషియల్ కాలనీ, విశాఖపట్టణం.

# ఉషాసుందరి

కె. వి. కామేశ్వరరావు *

పరీధావి పరీక్షించిపోయింది_
తెలుగుజాతి ప్రతిష్టా పటిష్టతల్ని పరీక్షా పత్రాలుగా మార్చి
ప్రమాదీచ చేతికిచ్చి-
ఇప్పుడు చూడాలి,
నా జాతి ప్రమాదీచ చేతిలో - ప్రమోదంతో నెగ్గుతుందో !
ప్రమాదంగా ఓడిపోయి - విడిపోతుందో !
అనుకుంటూ - అన్ని సమస్యలూ
ప్రమాదీచ ముందుకు తోసి - పరీధావి వెళ్ళిపోయింది - భవిష్యత్తులోకి.
భయం భయంగా చూస్తూ నిల్చున్నాను -
ఉషస్సుందరిలా వచ్చి నిలిచింది ప్రమాదీచ ఉగాది కన్య -
అభయ మిస్తానంటూ చేయిచాపింది,
ఈర్ష్యాద్వేషాల పరదాలను తొలగించి
మంచికి పట్టం కడతానంటూ -
భవిష్యత్తు బురఖాలోదాగిన ప్రమాదాలను గుర్తుచేస్తూ -
హెచ్చరికగా మసలుకోమంటూ.
పైషమ్యాల్నికాదు పెంచుకోవడం -
నింపుకోవాలి హృదయంనిండా అనురాగామృతమంటూ -
పువ్వుల్లాంటి పసిహృదయాల అమాయకత్వంతో బాటు,
కఠిన కర్కశ హృదయాల మన స్తత్వాల్ని శోధించమంటూ -
కావలసింది - చెడును అసహ్యించుకోవడమే కాదు,
మంచిని పెంపొందించుకోవడం.
మానవత్వాన్ని అలవరచుకోవడం.
విశ్వజనీనతే - పరిపూర్ణవ్యక్తిత్వానికి ప్రతీకయంటూ -
ఉషాసుందరిలా వచ్చి నిలిచింది - ఉగాది కన్య.

---

* పరిశీలకులు, హిందుస్తాన్ యంత్రపరికరముల కర్మాగారం, హైదరాబాదు.

# ప్రణయోల్బణ

గాదె శంకరయ్య *

ఓ సుకుమారసుందరి! మహోజ్జ్వలమైన యుషస్సునందెవో
ఆసలు రేపి హృత్కమలమందు చెలంగు మరందబిందువుల్
సేసలపోల్కి నాపయిని చెన్నెసలారగ చిల్కి నా మనో
వాసిని! నవ్వేదేల? నవపల్లవపాణి: ననున్ గ్రహింపవే!

సుందరములు మధురస ని
ష్యందములగు నీ పలుకులు చల్లార్చెను నా
యందలి తాపానలమును
మందానిలగమన! నిన్ను మఱవగ తరమే!

కిన్నెరకంఠి ప్రేమమయగీతిక పాడినయట్లు; రమ్య భా
వోన్నతిచే కవీంద్రుడు రసోత్తరకావ్యము లల్లినట్లు; రేల్
వెన్నెల తేనినింగనిన పిమ్మట కల్వలు నవ్వినట్లు - ఎ
న్నెన్నియొ భావమల్లికలు హృద్వనమందు సుమించె నిన్గనన్.

అదె యెలమావిపై మదపికాంగన రాగము దీసె; మల్లికా
హృదయములో వసించు భ్రమరేంద్రుడు ఝంకృతిచేసె నేలకో
పొదల సమూహమెల్ల తెలిపువ్వుల నవ్వుల నారబోసె - నిం
పొదవగ నీవుగూడ నవమోహనరాగము నాలపించవే!

సాహిత్యమ్మున నిన్నుగూర్చి సుషమాసంగీత సంశ్లిష్టమౌ
ఊహాబ్దమ్ముల ధారవోసితిని ప్రేమోన్మాదినై నేను నీ
సౌహార్దాంచితమూర్తి శిల్పినయి యుత్సాహమ్ముతో నిల్పి త
న్మోహావేశ భరాన క్రుంగితిని అంభోజాననా! నిత్యమున్.

---

* విద్యార్థి, ఎస్. వి. ఎస్. ఎ. కళాశాల, వరంగల్

# మన్ను తిను

నిష్ఠల వెంకటరావు, బి. ఎ. *

అనాగరిక మానవుడు అడవుల్లో వుండేవాడా
నాలుగువేళ్ళు నోట్లో కెళ్తే నాగరికుడయ్యేడా

భూమి సూర్యుడు, చంద్రుడు ఇంద్రుడు, గాలి నీరు
అన్నిట్నీ గుప్పెట్లో వుంచుకుని స్థావరాల్ని స్థాపించి
సాధు జంగమాలు సాధు స్థావరాల్ని భక్షిస్తే
క్రూరమృగాల్ని ఉసికొల్పి సస్యం స్వంతీకరించేడా
అయినా తీయపాలు మంచిమాంసం ఇచ్చేవాట్ని
గడ్డిగాదరా ఆకు అలముతో ఆదరించేడా.

అర్థంకాని పదార్థంతో దేవుడు దెయ్యాల్నిచేసి
తెలిసే సామాన్య సామాన్లతో "వర్తకం" చేస్తాడా!
'దైవ' సృష్టి తరువాతయుక్తి చీడపురుగు వ్యాపారమా,
అందుండి పుట్టిన అలగా "పుళ్ళు" సెంటేసి కప్పుతాడా!
సెంటుకి లొంగకుంటే కత్తి, తుపాకి వాడుతాడా
"కుళ్ళు పుళ్ళు" తిరగబడి ఆ తుపాకి ఎదురెత్తితే
కలికంలోకి ఎమికలేకుండ కామాప్ చేస్తాడా!

ఈ యిరవయ్యో శతాబ్దానికి అసలు సిసలు సమానత్వం
అతిసబువయిన దయినా దాన్ని సవాల్ చేస్తాడా!
ఇరవయ్యొకటి కాదు, ఇరవై వేల శతాబ్దాలొచ్చినా
ఒకప్రాణిని మరొక జీవి తినేటంత కాలం
చెట్టు చేమల్ని జంగమాలు మింగేంత కాలం
మనిషికై మిగతా ప్రాణులు ఉన్నంతకాలం
శూన్యంలో జీవం సృష్టించినా, సూర్యుడిమీది కెళ్ళినా
మన్నుతిని బతగ్గలిగిన్నాడే మనుతుంది సమాజం
అందాకా అన్నిథియరీలు అప్పడాల అల్పాహారం!

---

* ఎక్స్‌పోర్టు సూపరింటెండెంటు, ఆంధ్ర ఆయిల్ అండ్ కేక్ ప్రొడక్ట్సు లిమిటెడ్; విజయనగరం.

# ఉగాది ఆక్రందన

వి. వి. సత్యప్రసాద్, బి. కామ్. *

మళ్లీ ఓ పువ్వు పూసింది.
జీవన వృక్షం చిగురించిన కొత్త కొమ్మ కొనలో-
జరిగిపోయిన ఉగాదులముందు పునాదులు వేసుకున్న ఆశలు
పునాదుల్లోనే సమాధులై పోయాయి.
నిన్న-నేడు-రేపుల్లో నిన్నటికి విచారం, నేటికి నిర్లిప్తత,
రేపటిమీద ఆశ-మామూలై పోయాయి.
కొత్త సంవత్సరం వస్తోందన్న ఆనందం తప్ప
జీవనగతికి ఏం మార్పు తెస్తుందని?
పూర్వం నాలుగ్గదుల జీవితం
ఇప్పుడు రెండు గదులతో సంతృప్తి పడుతోంది!
మన తాతలనాటి పాతరాజనాల నీరాన్నాలు పోయి,
పేరుతెలీని బెడ్డల బియ్యం కడుపుల్ని నింపుతోంది!
హోమంలో ఆజ్యంలా-జీవన ప్రమాణాలన్నీ
వ్యాపారానికి ఆహుతి అయిపోతున్నాయి.
పెరిగే గదులకోసం-రసాల తరువులు బలిఅవుతున్నాయి....
చైత్రానికీ వైశాఖానికీ మధ్యఉన్న దూరం-ఎదిగే ఆకలి!
ఎదిగే ఆకలినిచూసి-గండుకోయిల నీరసంగా కూస్తోంది.
వయస్సు మళ్ళుతున్న దానిలా-కాలం
నిస్సహాయురాలై నిట్టూరుస్తోంది....
అయినా మతాబుదివ్వెలోంచి వెలుగు రవ్వలు రాలకమానవు-
భవిష్యత్తులోంచి ఆశలు రాకమానవు....
కాబట్టి-గతానికి తాజ్‌మహల్లాంటి అందమైన గోరీకట్టి-
ఈ దివ్వెల్ని, ఈ పువ్వుల్ని కాపాడుకుందాం!!

---

* క్లర్క్. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, హైదరాబాదు.

## అభినందన

"జయ" *

యువభారతి, ప్రియభారతి
నవచైతన్యంతో నడుస్తూన్న
జయ, జయ, జయభారతి!

యువతరానికే ప్రాముఖ్యం
యువకులదే ఆధిక్యం
మనిషి - మనిషిమధ్య మమత
మరువలేదు నా కవిత!

మారుతున్న కాలం విలువ
అడుగునదాగిన మనసువిలువ
గుర్తించని నేటి మనిషి
అర్థమెరుగని నాటి మనిషి,
ఇరువురి కలయిక శ్రేష్ఠమని
సాగిపోతున్న టీ యువతరం!

ఊయల ఊగినా, ఉన్నచోటికే వస్తుందని,
పరుగులు తీసినా, చేరవలపిన చోటు మారదని
ప్రబోధిస్తూన్న టీ తరం!
యువరక్తం - యువభావం
మసలుతున్న ఉద్రేకం, మారుతున్న ఆంతర్యం!
లేనివాని లోటును తీర్చి, ఉన్నవాని ప్లేటును మార్చి
ఎత్తు - తగ్గుల హెచ్చరిస్తూ, ఎదురీదుతున్న మా తరం
తరతరాలనాడు లేని, భావితరం ఊహించలేని
యువభారతీయులు కన్నకలలు, ఉషఃకాంతిలో వెలిగేరోజు
వెయ్యికన్నులు కాంచేరోజు
ఎదురు చూస్తున్నాను నేను, నిదుర కాస్తున్నాను నేను.

---

* ఇందుప్రకాశ్, విద్యార్థి; హైదరాబాదు.

## అబద్ధాల అలలు

[illegible] విశ్వనాథము *

అడుగడుగున అబద్ధం
అంతులేని ఉబలాటం
అబద్ధాల అలలతో
కవిత్వాల కలలతో
అవాకుల చవాకుల
ఉపన్యాస జలపాతాలతో
తన్మయులను చేయనెంచి
తనవైపు మళ్లించి
ఓటర్లను లెక్కించి
నోట్లకట్ట సరిచూసి,
రాత్రివేళ బయల్దేరి
రహదారులు వీడి
ఇంటింటికి పంచిపెట్టి
ఇష్టపడేటట్లు చేసి,
మాయమాటలెన్నో చెప్పి
మాటపుచ్చుకుంటారు
సీటుకొరకు పాటుబడుతూ
బూటకాలు వల్లిస్తూ
ఆత్మను—అంతరాత్మను
అణచి పెట్టివేస్తూ
అరచేతిలో వైకుంఠం చూపిస్తూ
అబద్ధాల అలలపై పయనిస్తూ
కొండంత కుతంత్రం చేస్తూ
కోరికల తీరం చేరుకుంటున్నారు.

---

* విద్యార్థి, న్యూ సైన్సు కాలేజి, హైదరాబాదు.

# ఎట్ ది ఏజ్ ఆఫ్ ట్వెంటీత్రీ

బి. శ్రీరాములు *

విశ్వ విద్యాలయపు కోడిపెట్ట
గ్రాంటు తవుడు బుక్కుతోంది
కాలమనే రాతిపైన
డిగ్రీ గుడ్డు పెట్టుతోంది
ఉపాధి కోడి పొదుగు
గుడ్డు చేరలేక పోతోంది
తిండిలేమి ఎండతగిలి
అది అలిసిపోతోంది
పనిలేమి రాకాసి
ఆకలి చేతుల చాచుతోంది
సంపద పసిపిల్లవాని
ప్రోగ్రెస్ పీక నులుముతోంది
నిరుద్యోగపు కొర్రాయి
కర్రియిల్లు కాలుతోంది
దారిద్ర్యం రైలకూత
చావుస్టేషన్ తెలుపుతోంది

* న్యూస్ పేపర్ ఏజంట్: ధర్మపురి

## ముగ్ధ

"జయబాబు" *

అరమోడ్పు కమలాలు
కాంతులను విసిరాయి
మురిపెముగ అవి పెక్కు
దిక్కులను చూశాయి.
పువ్వు చేరువ నిలిచి
నవ్వు నవ్వేను సామి
రివ్వు రివ్వున మనసు
జివ్వు జివ్వా మనగ.
అరుణ చుబుకము పట్టి
పేరిమితో పైకెత్తి
మరుని చూపులతోడ
తరుణి కన్నులచూచె.
పసిడి మొగ్గల సిగ్గు
మిసిమి బుగ్గల ఆడ
కొసరు అందము తోడ
పసిడి రెప్పలువిప్పె.
నయనాలు విరిశాయి
హృదయాలు కలిశాయి
ఇరులలో మెరుపులా
పెనవేసుకున్నాయి.
ముగ్ధమై మగువ
ముందునడవక నిలువ
పవలురేలూ_ఎదుట
నవలోకములు విరిసె.

---

* జయచంద్రబాబు, టైపిస్ట్-కమ్-క్లర్కు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు; ధర్మపురి.

# తెలుగు నాడు - నేడు

తార *

తల్లికోసం పోట్లాడటం। తలకోసం కొట్లాడటం।।
తెలుగువాడికే చెల్లింది। తెలుగువాడికే చేటిది।।
'తెలుగువాడు' అంటేనే తెగులువాడి సొత్తు అని, ఒక అపప్రథ.
ఆలోచిస్తే అనిపిస్తుంటీనాడు, నిజమేనేమో ఆకథ।
నిజంచెప్పాలంటే, "భారతమాతహృదయం తెలుగుతల్లి"।
ఇజాల పోరాటంలో నేడయింది కాలుగాలినపిల్లి,
నలుగురూ నినుజూచి నవ్వుతున్నారురా నాన్నా అంటే 'కన్నవాడు'।
'నవ్విపోదురుగాక। నాకేటిసిగ్గు' అంటున్నాడు చిన్నవాడు।
నిజానిజాలపై నిప్పులు కురిపిస్తున్నాయి తుపాకులు।
అజా పజా లేకుండా ఆహుతౌతున్నారమాయకులు:
ప్రజలదో।? పెడదారి। ప్రభువులదో?। తెలియకుండావుందినేడు।
ఏదిఏమయినా। అవుతోందినేడు, తెలుగునాడు, వల్లకాడు।
అమ్మహృదయంనిండా రగుల్తున్నాయి అగ్నిగోళాలు।
కిమ్మనలేక స్రవిస్తున్నాయామె కళ్ళల్లో అశ్రు కణాలు।
ఏకోదరులవేర్పాటు చూసి, ఏమంటుంది అమ్మ।
ఏమయినా కన్నకడుపు అమ్మది. అమృతమయిగదా అమ్మ।
స్వార్థానికంటె పరమార్థం మిన్నయని తెలిసి(పి)న తెలుగునాడు।
తరతరాలుగా జ్ఞానపద్మం వికసింపజేసిన తెలుగునాడు।
వేద విజ్ఞానానికి, వెన్నెముకై నిలిచిన తెలుగునాడు
వేర్పాటుకు బానిసయిందంటే వెఱ్ఱితనంకాక మరేమిటి?
సంస్కృతీ సభ్యతలను సమూలంగా మరచిన తెలుగువాడు
శశాంకాంగణంలో అడుగిడిన మానవుడున్న ప్రగతిలో ఈనాడు
వసుధైక కుటుంబానికి వారసత్వం పొందవలసియున్న ఈనేడు
పిట్టకోసం, గెట్టుకోసం, కొట్లాడడం, పిచ్చితనంకాక, మరేమిటి?।

---

* తాళ్ళూరి రఘుపతిరెడ్డి, అధ్యాపకులు, సదాశివునిపాలెం; ఖమ్మం జిలా.

# వాన - వరద

"హారిత" *

ఆకాశం బ్రద్దలై కురిసింది వాన
భయకంపితమై తడిసింది ఈ కోన
గుండెలదిరేలా గర్జించింది మేఘం
పిడుగుపడి దద్దరిల్లిందా భాగం

కట్టలు తెంచుకొని పొరలింది నీరు
పట్టణాన్ని ముంచెత్తిందా వరదనీరు
కూలీనాలీ, గుడిసెల్లోని భీతావహులు చేరారు ఆ సౌధంలో
చేరారందరూ ఒక్కచోటు
చచ్చారందరూ ఒక్కమాటు ఏడ్చేవారు మిగలక
తల్లీబిడ్డ-భార్యాభర్త-అన్నాచెల్లి-చిన్నాపెద్ద
అందరూ పోయారు కాలగర్భంలోకి ఏమీ మిగల్చక అదేసౌధంలో

ఫడేల్-ఫడేల్-మని ప్రళయకాల శబ్దాన్ని పుట్టించింది ఆకాశం
అమ్మా-అమ్మా-అని ఘోషించింది ఈ భూకోశం

ఆ భీకర శబ్దానికి మేల్కొందొక కూన
ఎదిరించే శక్తిలేక చేరింది తల్లి-ఒడిలోన
గుండెలకదుముకున్న బిడ్డతో సహా అసువులు
బాసిందా మాతృమూర్తి ఆ సౌధంలోన

క్రొత్తజంట కోరికలు చెలరేగ
కురుస్తున్న వానకు పుట్టుకొస్తున్న చలికి
కౌగిలిలో బందీలై
ఎడబాటులేక ఏకంగా మృత్యువాతబడ్డారదే సౌధంలో

ఓ ప్రాణి ఉసూరు మంది ఓ తల్లి కడుపు కాలింది
ఓ జంట విడిపోయింది ఆధ్వనికి.

---

* బి. రమేశ్, ఉపాధ్యాయులు, గాంధీ స్మారకోన్నత పాఠశాల ; హైదరాబాదు

## ఆవేదన

- వాసికర్ల రవీంద్ర *

వస్తున్నావా ఓఉగాది-వస్తున్నావా ఓనూతన సంవత్సరాది
ఏమని నీకు స్వాగతం పలికేది
కాలం కాల సర్పమై కాటేసేవేళ
మానవత మరుగునపడి-దానవత్వం నాట్యమాడే వేళ
అభిమానాలు చంపుకొని-అనురాగాలు త్రెంచుకొని
మాలో మేము పోట్లాడు కొంటూ
మానవత్వాన్ని రూపుమాపి-మంచితనానికి సమాధులుకట్టేవేళ
ప్రకృతి పరిహసించే వేళ
క్షామదేవత ప్రళయ నృత్యం చేసేవేళ
స్వార్థం పురివిప్పుకొని ఆడేవేళ
వర్షాలు లేక-వరుణదేవుని కరుణలేక
భూమితల్లినే నమ్ముకొన్న రైతుబిడ్డ
ఎండిన బీడులమీద పడి రోదించేవేళ
నిరాశ, నిస్పృహలమధ్య మనిషి నిత్యం మృత్యువుతో పోరాడేవేళ
వస్తున్నావా ఓ శుభాది !
అదిగో! అచ్చట-
పచ్చని సౌధాలలో నులివెచ్చని పాన్పులపై పరుండి
నీకోసం ఎదురు చూస్తున్నారు
పండుగపేరుచెప్పి పేదవాని పచ్చిరక్తమును
విస్కీ-పెగ్గులుగా మార్చిత్రాగే వారివద్ద
నీకు కొండంత పండుగ ఉంటుంది
కనులలో ప్రాణాలు నిలుపుకొని
జానెడు కడుపుకోసం కానిదోషాలు చేసే మావద్ద
ఏముంది నీకు స్వాగతం పలుకడానికి-

---

* సాహితీప్రియులు, ఎలక్ట్రానిక్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా; హైదరాబాదు.

## గులాబి

ఎం. రత్నాకర్ రావు *

గులాబి వికసించింది
రెక్కలు విప్పుకున్నాయి
జాబిలి నడుస్తుంది
వెన్నెల విహరిస్తుంది।

రంగురంగుల సీతాకోక
వడిగా పరుగులతో వచ్చి
మకరందాన్ని జుర్రుకోవాలని
మందహాసం చేస్తుంది।

సిగ్గు తొంగిచూస్తుంది
మనసు పొంగిపోతోంది
హృదయం పులకరిస్తుంది
తనువు జలదరిస్తుంది।

మధురానుభూతులు
మెదిలి కదిలిపోతున్నాయి
అమృతాంతరంగాలు
కరిగి ఘనీభవిస్తున్నాయి।

తీరిన తీయని కోర్కెలు
స్వర్గానికి దారి చూపాయి
సీతాకోక ఎగిరిపోయింది
గులాబి వాడిపోయింది।

---

* సాహితీప్రియులు. పాపయ్యపేట; వరంగల్.

## కొత్త వెలుగు

బాలాంత్రపు శ్యామలరావు, ఎం. ఏ. *

మమత మానవత లేనినాడు
మానవజీవితమే వృథా।
మనసులో కాలుష్యం ఉన్ననాడు
మనం చెప్పే సూక్తుల విలువేమిటి?
చెప్పేదొకటి, చేసేదొకటి
అనుకునేది మరొకటి, ఆచరించేది వేరొకటి।
సంస్కారం, సంస్కృతి మరచిననాడు
నీ మనుగడకే ముప్పని మరువబోకు।
కాలం విలువ, డబ్బువిలువ
తెలిసి మెలిగిననాడే
నీ జీవితానికి పరమార్థం।
ఇప్పటికైనా నీ స్వార్థంకోసం
దేశాన్ని దోచుకోవడం మానేసి
దేశంకోసం నీ జీవితాన్ని
త్యాగం చెయ్యడం నేర్చుకో।
ఈ ఉగాది నీలో కల్గించాలి కొత్త భావాలు
మన రాష్ట్రంలో వెలిగించాలి నూతన జ్యోతులు।

---

* ఆంగ్లోపన్యాసకులు, ఎస్. కె. బి. ఆర్. కాలేజి; అమలాపురం.

# కాలచక్రం

మల్లిడి రామమోహనరెడ్డి, బి. ఏ. *

సృష్టి అనంతం
ఆద్యంత రహితం
కాలం కూడా అనంతం....
అనంత కాలంతో పోలిస్తే
ఒక మనిషి కాలం
ఒక తృటిమాత్రం.
ఆ త్రుటి కాలంలోనే_
అన్నింటికి
అవాంతరాలు వస్తూ
ఆగలేక
అలసిపోయి
సొలసిపోయి
కాలచక్రంలో నలిగిపోయి
పెనుతుఫానులో చివికిపోయి
బ్రతుకుయాత్ర
బరువుకాగ
నిరాశలతో
నిట్టూర్పులతో
నిగూఢమైన దాపరికంతో
జీవనయాత్ర సాగిస్తూ
నిజాన్ని ఆలోచించలేక
సత్యాన్ని అన్వేషించలేక
మానవత్వం మంటకలిపి
జీవితసమరంలో
చివరికి ఓటమి.

---

* అధ్యాపకులు, తాళ్ళముదునూరుపాడు; పశ్చిమగోదావరి జిల్లా.

# అంతర్వాణి

జి. ఆర్. కృష్ణమూర్తి *

సవ్యంగా ప్రయత్నిస్తే ఏదైనా
మానవుని కసాధ్యమంటూ లేదు.
కాని చేసిన ప్రయత్నం మాత్రం
లోపరహితంగా వుండాలి.

మానవుడు సవ్యంగా ప్రార్థిస్తే
కోరినవన్ని దైవం ప్రసాదిస్తాడు
కాని ఒనరించిన ప్రార్థనమాత్రం
లోపరహితంగా ఉండాలి.

జీవితంలోని సమస్యలన్నీ
సవ్యంగా పరిష్కరించుకోవచ్చు.
కాని దైవం యందు విశ్వాసం మాత్రం
లోపరహితంగా వుండాలి.

లోకంలోని సమస్త జనులు
నిన్ను తప్పక ప్రేమించగలరు.
కాని వారియందు నీ ప్రేమమాత్రం
లోపరహితంగా వుండాలి.

ఏది యోచించినా, ఏది పలికినా
జీవితంలో ఏ కార్యం చేసినా
యోచించు, పలుకు, చెయ్యి—
కాని అంతా సవ్యంగా, సవ్యంగా వుండాలి

* అధ్యాపకులు, ఇంజినీరింగ్ కాలేజి విశ్వవిద్యాలయం; హైదరాబా

# నవ్వుతోంది సోషలిజం

డి. వి. శర్మ, బి. ఎస్‌సి. *

చలి వరదై నాకేస్తోంది—పేద శరీరాన్ని
కడుపులో దావానలం—కరిగిస్తోంది కండల్ని
కళ్ళు కాంతిహీనం—పిలుస్తోంది మృత్యువును
పేదవాడింట్లో చేస్తోంది—సోషలిజం ఓ భయంకర నృత్యం
జారిపోతున్నాడు—పేదవాడు సోషలిజం లోకి.

ఒళ్ళు తడుముతోంది
ఉన్న శక్తిని తాగేస్తోంది
కళ్ళు తుడుస్తోంది
ఉన్నకాంతిని లాగేస్తోంది
సైనెడ్ పట్టేస్తోంది
శ్మశానానికి లాక్కుపోతోంది
పేదవాడికి సోషలిజం
మరీ సన్నిహితం అయిపోతోంది.

సోషలిజం సహవాసంలో
ఆశల్లా అశాంతి పెరిగి
వస్తాడు చివరికి గొప్పవాడు—పుచ్చిన వంకాయలా
వస్తాడు కాటికి వందల అభిమానులతో

అదిగో చూడు—అదే కాష్టం
దానికి లేదు—మనుషుల భేదం
కాని అక్కడే ఓ విపరీతం
గొప్పవాళ్ళ చితిలో
కాలుతున్నాడు పేదవాడు
ఎండిన సరుగుడు కర్రలా.
నవ్వుతోంది సోషలిజం
కాలే కర్రల్ని—ఎగిరే మంటల్ని చూసి.

---

* ఆడిటర్, సి. డి. ఎ. (20); పూనా.

## ఇజం కథ

మధుసూదన్, కె. (సవేరా) *

నిజంగా నీ యిజం యేదైతేనేం
నీవు చెప్పేదిమాత్రం భేషరతుగ
నిప్పులాంటి నిజముందు
చెప్పు క్రింద తేలు.
తప్పుతాగిన పెదవులల్లె
తప్పుడు తడకల పుక్కిటిపురాణాలు.
పువ్వును ప్రేమించలేనినాడు
పసిపాప నవ్వులకు హృదయం స్పందించనినాడు
నీ హృదయం ఎంతసుకుమార మైతేనేం!?
నీప్రేమ యెంత విశాలమైతేనేం!?
ఎప్పుడు గొట్టెకు బెత్తెడుతోకలా
ఎదిగీ యెదగని బ్రతుకుతో సతమతమౌతూ
ముడుచుకుపోయిన పేదబ్రతుకులకు
ముక్తినీయలేని నీయిజంకథ యేదైతేనేం!?
నీమాటల మూటలు వట్టి
నీటిమీద వ్రాతలని తేలినపుడు
నీవుచెప్పేవి కాకమ్మ కథలని తెలిసినపుడు
నీకు బ్రహ్మరథం పట్టిన ప్రజావాహినియే
నీ యిజానికి నిప్పుపెట్టి
నీకు గోరీ కట్టి
నిప్పులాంటి నిజాన్ని నిరూపించడం సత్యం
నీ యిజం కథకు తుది ముట్టించడం తథ్యం.

---

* విద్యార్థి, విజయపురి సౌత్; గుంటూరు జిల్లా.

# కుండ

వి. మధుసూదనరావు, ఎం. ఏ. (తెలుగు) *

'అదంతామట్టి!'
అవును-అంతామట్టి
ఆ మట్టి అంతా ఒకచోట
పోగయింది.
కష్టం నేనున్నానంటూ
వచ్చింది,
ఆ కష్టంతో-
సృష్టించ బడింది ఒకకుండ.
కుండ ఎండింది
తడి ఆరిపోయింది
కుండను నింపాలిగా మరి!
దేంతో ?
ఒక్కొక్క బొట్టే నీరు
కుండలో వచ్చి పడుతూంది
చాలా సేపటికి
ఎంతో కాలానికి
కుండ నిండింది
నీళ్ళతో-
ఇంతలోకే ఎక్కణ్ణించో
రివ్వున ఒకరాయి వచ్చి
కుండకు తగిలింది
కుండకు కన్నం పడింది,
పడి పగిలిపోయింది
నీళ్ళన్నీ కారిపోయాయి.

---

* సాహితీప్రియులు, మలక్ పేట కాలనీ; హైదరాబాదు.

# సామాన్యం (శాస్త్రం) స్వగతం

ప్రొ॰షి లీలస్ రెడ్డి *

అంబుదంలోని ఆనందాన్ని
అందుకోవాలంటే చేతికందేది
మాత్రం శూన్యం.
అందిన శూన్యాన్నే నందనవనం చేయ్
బృందావనము కాని
బృందగీతము పాడేసి
అంబరాన్ని చుంబించాలనుకొంటే
పెదవి కందేది అధరామృతం కాదు
నీ కందేది అధరామృతం కాదు
నీ కందేది మాత్రం
నల్లని కర్బనం.
దాన్నే చలువరాతి మందిరం చేయ్
అంబుధిలోని ఐశ్వర్యం
నీ స్వంతం అనుకొంటే
నీ కందేది ఆరని అగ్ని
ఆ జ్వాలనే
మలయానిలయం చేయ్
మలయ మారుతం శ్వాసించేసేయ్.

* విద్యార్థి, గద్వాల; మహబూబ్ నగర్.

# నేను + నీవు = మనం !

సాధంశెట్టి రాజేంద్ర, బి. కామ్. *

కాళ్ళూపుకుంటూ
చేతుల్తో నడుస్తున్న
విచిత్ర మానవుడా !
కళ్ళుమూసుకొని
చెవులతో చూస్తున్న
వింత జంతు సంతానమా!
ఇదిగో.... ఇటు_
ఎందుకు ఆశ్చర్యపోతావు?
నేనూ! నీ ప్రత్యర్థిని!!
అప్పుడే నన్నెట్లా మర్చిపోతావు?
ఇప్పుడు నన్నెట్లా గుర్తుచేసుకొంటావు!
నీ ముసుగుతీసి నన్నుచూడు,
అబద్ధమనుకొని అటూ యిటూ చూడకు,
ముసుగంటే నెత్తినవున్న ముసుగుకాదు
ముసురంటే తుఫాను పట్టిన ముసురూకాదు.
నీకు పట్టిన చెదలు! నీకు పట్టిన ముసురు!
నీ బుద్ధికి పట్టిందే, అది నీముసురు
నిజంగా, అదే! ముసుగంటే
నీ కంటికి పట్టిన కావరం! అదేముసుగు. అంతే!
అది తొలగించు !
అప్పుడే నీకు కనపడ్తాను నేను!
అప్పుడే నన్ను చూస్తావు నీవు!
అప్పుడే కలుస్తాము మనం!

---

* సాహితీప్రియులు; విజయవాడ.

## అందరూ వచ్చేయండి !

బి. అచ్యుతరాజు *

అమృతం పంచేస్తున్నా
అందరు వచ్చేయండి!
అరమరికలు లేకుండగ
అందినంత గ్రోలండి!

అయిపోతుందనెడి చింత
అక్కరలేదసలు మీకు
సంప్రదాయమును మీరక
చక్కగ గ్రోలుడి తేపకు! ॥అ॥

అక్కరలేదొక్క పైస
చక్కటీరి కూర్చోండి !
సమభావముతో సోదర
'ప్రమాటీచ'లో వెలుగుడి ॥అ॥

పంక్తిలోన రాహువులకు
బ్రాహ్మణులవ్వాల్సిలేదు
కేతువులను గురుతుపట్టి
గొంతులు కోసేదిలేదు
సూతు లగ్రజాతుల మని
చేతులు నలపాల్సిలేదు
ఏకలవ్యులకు నిచ్చట
ప్రాకటముగ 'సీటు' కలదు ॥అ॥

అక్షరాస్యులై మీరు
ఆనందము పొందండి!
అచ్యుతమౌ జ్ఞానముతో
అలరి యలరజేయండి! ॥అ॥

---

* ఉపాధ్యాయులు, ప్రభుత్వ జూనియర్ కళాశాల; కరీంనగర్.

# సాంధ్య వేళ

బాలా సోమనాథశాస్త్రి *

చండ ప్రచండుడై శ్వేతాశ్వరథారూఢుడై
దివిమండలమేలిన శనైశ్చరుని జనకుడు
అస్త్రాద్రికి చేరుకుంటున్నాడిప్పుడు.
సహజసౌందర్యాన్ని చిందుతూ చీకటికన్నె
అందించే స్వాగతాన్ని అపురూపంగా గొని
ఆమెను చేరుతున్నాడు అలసటంతా తీర్చుకొనుటకు.
అసమానతేజోధనుడు, దేవతాశ్రేష్ఠుడు, సూర్యుడు.
పగలంతా ఒళ్ళువిరిచి, కండకరిగించి
చేసినకష్టాన్ని మరిపించి భవిష్యత్తు
చూపించు ఈ సంధ్యవేళ
సేదదీర్చుటలేదు గారువముగ నన్ను.
సందెవెలుగు పోయింది అంధకారం వెలిసింది
కష్టించినా ప్రతిఫలమివ్వని నా యజమానివలె.
ఈ చీకటి నాపాలిట పెనుభూతమై
సాహిత్య రసాస్వాదనము చేస్తున్న నాకు
ఈ పూటకు అన్నంలేదన్న విషయం
స్మృతిపథంలోకి తెచ్చింది
భూతమును వదలి భవితవ్యమును చూడమంది.
ఈ చీకటి మాయమై రవితేజము ఆదేశమై
నా జీవితం ఎపుడు వికసిస్తుంది ?
ఆలోచించే శక్తి రావడానికైనా అన్నమెపుడు దొరుకుతుంది ?
ఇంకా సాహిత్యలోకంలో విహరింతమన్న
బాహ్యకష్టనష్టములు మరచిపోదామన్న
కనరాదు కాగితం కదలదిక కలం.

---

* విద్యార్థి, బర్కత్‌పుర్, హైదరాబాదు.

## చూచుకో ?

తమటం లక్ష్మణగౌడు *

ఈ సువిశాల ప్రపంచంలో_నీవు
బ్రతికి బాగుపడదామనుకుంటే ?
ఉదరంలోన, గరళం దాచి
కనువిందుగా, మునుముందుగా
నవ్వుల చిందింప నేర్చుకో !
కాలసర్పం, క్రూరదర్పం
కాటేసినా, నేలకూలినా
గుండె ఆగినా, మంటరేగినా,
నవ్వుల చిందింప నేర్చుకో !...
స్వానుభవాన సాగెమాట
జీవితాన్ని దిద్దేమాట_
దీన్ని, వినటం_నేర్చుకో !....
జగమంతా బాధగా
కనుల దోచినవేళ
మత్తుతో తనువు
మరచిపోవటం_నేర్చుకో !....
కాలమిది ఒకవాహిని !
కదలిపోవటం ఖాయం
వెనక్కి రావటంలేదు
ఎదురీదావంటే....
ఈ బాధలే ?
ఈ చావులే ?
నేర్చుకో !....ఆపైన నీ యిష్టం !
చూచుకో ! రెండు_కష్టం నష్టం.

---

* విద్యార్థి, సుల్తాన్‌బజార్, హైదరాబాదు.

# యూ కెన్ గో

త్రిజగన్మోహనాచారి *

ఓయి! వేయకు నాపై భారం వేయకు
సహాయం చేయలేను—నే నసహాయుణ్ణి
దీనజన రక్షకుండనే బిరుదున్న
ధీమంతుణ్ణికాదు కాంతాలోలుణ్ణి కాదనకు
శిష్టరక్షణే నా విశిష్ట ధర్మమయినా
ప్రేయసి పూజలందుకుంటున్న నన్ను
రమ్మన నీకు తగదోయి!
నీ కర్తవ్యం నీవు చూచుకోవోయి!
అన్యాయ పూరితమైన ఈ ప్రపంచముతో
విసిగి విసిగి వేసారి
ప్రేయసి వలపులందుకుంటున్నాను
రమ్మనవలదోయి.
నన్ను పూజిస్తూ నాపై భారం వేస్తూ
నేనే సర్వం అని మీరు భావిస్తూ వుంటే
మిమ్ము కాపాడలేక అసహాయుణ్ణిగ నిలుచున్న నన్ను
పిలిచి ప్రేయసి పరిష్వంగమున బంధించి
కాంతంటే నాకెంతో ప్రీతి మీరు మీ బిరుదులన్నీ అవసరంలేదు,
మీకు నే కనిపించను కనికరం కురిపించను.
ఏకాంత యమునాతటిలో ప్రేయసితో ఆశతో
ప్రేమగీతాలు పాడుతూ ప్రేమామృతం పానం చేయాలి.
ప్రమాదీచలో నాకు ప్రమిదల ప్రేమపూజలే
ప్లీజ్ బాబు మోపకు నాపై వేస్టేవెయిట్
చేయలేను నీకే హెల్ప్
లాభంలేదు బాబూ యు కెన్ గో.

---

* విద్యార్థి, దారుల్ షఫా, హైదరాబాదు.

# గ్రహణం పట్టింది

ఎం. రామచంద్రారెడ్డి*

శాంతివనములో రాబందులు
రెక్కలుతెగి రక్కుతున్నవి.
వెన్నెల వెలుగులో చీకటి ముద్దలు
అందముగ వ్రేలాడుతున్నవి.

ముద్దుగ విరసిన గులాబి రేకులు
పద్దన్నా రక్తాశ్రువులు కార్చుతున్నవి.
జల్లున కురిసిన కన్నీటి చినుకులు
గొల్లున కషాయాన్ని త్రాగుతున్నవి.
మూగవోయిన దొకమహతి
మరుగున పడినది అమరావతి.
అడుగంటిపోయిన తలపు
అందుకోజాలని పిలుపు.

కాలం మనఃఫలకాన్ని ముక్కలు చేసుకుంది.
ముక్కకొక్క సమస్యాచిత్రాన్ని చిత్రించుకుంది
ఆ చిత్రాన్ని చూచి భ్రమపడిన మానవుడు
గుండెను పిండుకుంటూ కాలాన్ని వెదకుతున్నాడు.

కంటిముందున్న అందాన్ని కాలదన్ని
హరివిల్లును అందుకోవాలని పయనం.
ఇంటిముందున్న గంగాజలాన్ని వదలి
ఎండమావులను వెంబడించే వైనం.
సువర్ణ గీతికలు చరిత్రపుటల్లో నిలిచి
సుమబాలల పరిమళాల తరగలు వీచి
మహతి పలికి, అమరావతి పిలిచి
గ్రహణం విడిచే మంచిగడియ లెపుడో.

* ఉపాధ్యాయులు. ఎస్; వి. ఉన్నతపాఠశాల, తిరుమల; చిత్తూరు జిల్లా.

## ప్రభాతారుణిమ !

పులిచేరి రామ మోహనరావు *

సూర్యుడరుణిమ సంతరించుక
నింగి మొగలో తొంగిచూచెను।
విరిసె కమలపు కంటిరెప్పలు
మెరిసె జలమున అరుణ కాంతులు।
వలువమార్చిన తరుణి ప్రకృతి
అరుణ వర్ణపు పమిట చెరగున
హొయలలరగ తూర్పు మెరసెను:
విరుల నలరెడు తుహిన బిందువు,
వింత కాంతుల విస్తరించగ
చూడ నోర్వని నీలినీడలు,
మూల మూలల నొదిగి చనియెను।
గాఢనిద్రను సేద తీర్చుక
వివిధ జీవులు మరల మొదలిడు,
బ్రతుకు పరిషత్ సభాపతి యన
సూర్యుడరుణిమ సంతరించుక
నింగిమొగలో తొంగి చూచెను।

---

టికెట్ ఎగ్జామినర్, దక్షిణ మధ్య రైల్వే; విజయవాడ.

# వీరనారీమణి

రవిశ్రీ *

అమెరికాచేయు అక్రమాలు పరికించి
ప్రత్యుత్పన్న మతితో పరామర్శించి
రష్యాతో నెయ్యము నెఱపి
బంగ్లాను నిలిపి పున్నెము గట్టుకొంటివి.

బాపూజీ బాటలలో నడచి
నెహ్రూజీ నియమాలు నిలిపి
శాస్త్రీజీ చట్టాలు చాటి
అంతర్జాతీయత కర్థము కల్పించితీవు.

త్యాగమె ధ్యేయముగ తలచి
స్వార్థం విడచి, స్వసుఖం మరచి
దురాక్రమణ జేయు దుండగులనణచి
అన్నమోయని "అల్లాడు" ప్రజావళి నాదుకొంటివి.

రుద్రుని మించిన రౌద్రముతో
మనజోదులు అరివీరుల
ఉరముల (గుండ్లను) నింపి
విజయధ్వజము వెలయించిరి.

"భారత రత్నమ్మ"ను బిరుదు బహుధా అన్వర్థమై వెలిగె
అమెరికన్ ఆయుధాలు అధోగతి జెంది 'తొలగె'
ఇందిరా రమణి వీరనారీమణి యన 'బఱగె'
అఖండ భారతావని అద్వితీయ సుఖశాంతుల 'జెలగె'.

అసమాన పాలనా ప్రాభవమున
"భావి భారతమ్ము"
భవదీయ కరకమలముల ముందు
వెలగొందుగాత వేయివిధముల.

---

* అద్దంకి హనుమంతరావు, సాహితీప్రియులు, దబీర్‌పుర; హైదరాబాదు.

## కోయిలతో ఒక మనవి

తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి *

గండుకోయిల! గండుకోయిల!
ఎందుకే నీ కుహూ కుహూ
వచ్చిందా వాసంతం
పచ్చని వలువలు తొడుక్కొని.
అయితే నా ప్రేయసి
ఆమనితో రాలేదేం?
ఏటిగట్టున ఉందేమో వెతుకు.
నీ రాకకై నీ ప్రియుడు వేచియున్నాడని చెప్పు.
రెక్కలాడిస్తూ మళ్ళీ ఏమిటి ఆ కుహూ కుహూ?
ప్రక్కనే ఉన్న సరోవరంలో
ఒక్కతే జలకమాడుతోందా నా ప్రేయసి?
రెక్కలు కట్టుకొని వాలమంటోందా ఆ సరసి.
ఈ మధుమాసంలో
ఆ సరోవరంలో ఆమెను కలుస్తాను.
విరబూసిన గులాబీలను
అర విరసిన మొగ్గలా ఉన్న
ఆమె కొప్పులో ఉంచుతాను.
మాధవీలతలా వంగి
ఆమె అందించిన మోవిలోని
అమృతాన్ని గ్రోలుతాను
అప్పుడు నీవు చూడకు.
చప్పుడు చేయకుండా ఎగిరి
చప్పున దేశాలు తిరిగి అందరికి
ఇప్పుడే వచ్చింది వాసంతం అని నామాటగా చెప్పు.

---

* ఎల్. డి. సి., ఏ. జి. ఆఫీస్; హైదరాబాదు.

# నా జీవితం

సి. ప్రకాశరావు *

అరుణోదయాన వికసించే
ఒక కుసుమం నాజీవితం.

సూర్యునితో తిరిగి, తిరిగి,
వాడి రాలు ఒకపుష్పం నా జీవితం.

గులాబి ముండ్ల పడకలపై,
ఆనందాన్ని అనుభవించు అల్పజీవితం, నాజీవితం.

శీతల తరుచ్ఛాయలలో నే నసువులు విడిస్తే,
ఏడ్చేదెవరు? ఓదార్చేదెవరు? ఇంతేయింతే నాజీవితం,

ఎడారిలోని పాదముద్ర నాజీవితం.

ఒక తుఫాను కౌగిలిలో, ఎగిరిన రేణువులలో
రేణువునై అంతరించు అడుగు గుర్తు నా జీవితం.

ఎందుకు నేనీ భూమిలో ఒంటరిగా పుట్టానో,
ఎందుకిలా నేను అస్తమయమై పోతున్నానో,
అర్థంకాదు నాకు, అనుభవం లేదు నాకు,
ఇంతే ఇంతే నా జీవితం.

---

* ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, పబ్లిక్ రెస్టుహౌజ్; హైదరాబాదు.

# "ప్రస్థానం"

"రావణ" *

ఎప్పుడు? ఎప్పుడు?
తలపుల తలుపులు తెరుచుట ఎప్పుడు?
విలువల కలువలు విచ్చుట ఎప్పుడు?
    అప్పుడె అప్పుడె
    మనమున ముడులే విప్పేటప్పుడె
    వనమున వెన్నెల విరిసేటప్పుడు.

గంటలు గంటలు
నవ రవముల గంటలు మోగేదెప్పుడు?
నవ స్వరముల వీణలు మీటేదెప్పుడు?
    అప్పుడె అప్పుడె
    నవచేతనచేతులు గంటల తాకేటప్పుడె.
    కవితా విపంచి తంత్రుల మీటేటప్పుడె.

భ్రాంతులు భ్రాంతులు
భ్రమింపజేసే భ్రాంతులు తొలగేదెప్పుడు?
కళ్ళనుకప్పె రాత్రుల భ్రాంతులు నమసేదెప్పుడు?
    అప్పుడె అప్పుడె
    నిజాల ధ్వజాలు ఎగిరేటప్పుడె,
    నిజాల ఋజువులు నిలిచేటప్పుడె.

కాంతులు కాంతులు
మెరిసే కాంతులు కురిసేదెప్పుడు?
కురిసే వెన్నెల విరిసే దెప్పుడు?
    అప్పుడె అప్పుడె
    సమతా భావం వెలిగేటప్పుడె,
    నవతాలోకం వెలిసేటప్పుడె.

---

* శ్రీ. మంగయ్యనాయుడు, విద్యార్థి, రావిళ్ళవారిపల్లె; చిత్తూరు జిల్లా.

# 'కవిత' వ్రాయాలని

సూరపనేని కరంచంద్ మోహన గాంధి *

కవిత వ్రాయాలని క్రాంతి పథం చేరాలని కలం పట్టాను....
కలతల ఊహలతోడ, కలము ముందుకు పోక
కనులు మూసుకునేను, కలల అలలలో కలసిపోయాను.
కలలోన కనుపించె కమనీయ రూపిణి,
కమల సంభవురాణి, కవితలొసగెడువాణి.

కరుణతో నా నుదురు తన చేతితో నిమిరి,
కలతకు కారణం చెప్పమనె నాతల్లి!

కవితా వ్యాసంగం కఠినంగా ఉందని
వాస్తవం వ్రాస్తే ఒడిదుడుకు లొస్తున్నాయని
కలియుగ దుష్కృతల నాపివేసే కవిత నాకివ్వమని
నా కవితావిధానాన్ని కాపాడమని కలతకు కారణం చెప్పేను....

ప్రవహిస్తోంది ప్రతివానిలో రాజకీయాల స్రవంతి.
అంగాంగాన అలంకరిస్తూంది మోసం, విద్వేషాలపూబంతి....
ప్రగల్భాలు పలికిన వానిని ప్రముఖుడంటారు,
ప్రగతి పథగాముల ఉనికే అసలు గుర్తించరు....

నిజాన్ని నిర్భయంగా చెప్పే వాడిని పిచ్చి వాడంటారు,
నీతికి గోతులు తీసి, అవినీతిని అందలమెక్కిస్తారు....

కర్తవ్యం కాదట అసలు కావల్సింది,
కాలానుగుణంగా కదలాలట నా కలం.

విన్నవించాను నా బాధల్ని, విని వివరించె వాణి తుదకిటుల
బ్రతుకు బాటను మరువని బాధ్యత ఉన్నది నీకు,
ప్రజలమేలు కోరు బ్రహ్మపదం పలకాలి నీనోట,
తుదకు అనుసరిస్తారు ప్రజలంతా నీబాట,
అప్పుడే నీ కవితకు విలువుంటుందీ చోట.

---

* టెక్నీషియన్, హిందుస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్; హైదరాబాదు.

## కాలాన్ని అధిగమిస్తా !

మోచర్ల వెంకటరావు *

మనసారా నిన్నారాధిస్తా
రక్తంతో కవిత్వం రాస్తా
అశ్రువులతో ఆలాపిస్తా
నా అహంకారాన్ని
నీ ప్రేమకు బలిచేస్తా.

నీలో నా ప్రతిబింబం చూసుకుంటా;
నీ మనస్సును నా హృదితో చూరగొంటా.
నీ ఆశలలో నా ఆశయాలను చూసుకుంటా.
నీ చెక్కిళ్ళలో గులాబీలను కనుక్కుంటా.
నిన్ను పట్టుకుని నింగికెగిరిపోతా.
నిన్ను కౌగలించుకునే
అవకాశాని కెదురుచూస్తా.

నీలో నన్ను చూస్తా
నాలో నిన్ను చూస్తా
నా హృదయవీణను మీటి
సంగీతాన్నారోహిస్తా.

ఎర్రబారిన నీ
సిగ్గుల మొగ్గల వికసింప జేస్తా.
నీ విశాల హృదయాన్నాక్రమిస్తా.
నీ మనసులోని అ[illegible]లతో ఆలోచిస్తా.
నీతో కాలాన్నధిగమిస్తా.

* లీగల్ అసిస్టెంట్, ఆంధ్రప్రదేశ్ భూమి తనఖా బ్యాంకు; హైదరాబాదు.

## భరతమాత

ఎస్. వి. సుబ్బరాయశాస్త్రి *

సకల సౌభాగ్యములతోడ సంచరించె
వితత విభవంబుతోడను విస్తరించె.
తెలుగు వెలుఁగుల తోడను తేజరిల్లె
నాడు ఒకనాడు మననాడు ఆంధ్రభూమి!

తేట వెలుఁగుల మనతల్లి తెలుఁగుతల్లి.
అట్టి తల్లిని మనవారు తిట్టి కొట్టి,
తల్లిపాలను కడుపార త్రాగిత్రాగి,
తనయులిట్టుల పొడిచిరి తల్లి రొమ్ము!

ఇంతజేసిన నా తల్లి యంత మఱచి,
వేయి కిరణాల కాంతుల వెలుగునిచ్చి,
మనల దీవించుచున్నది మఱల మఱల
అస్తు, శుభమస్తు! విజయోస్తు! ఆంధ్రులారా!

అల్లదే నూత్న సంవత్సరమ్మరుగు దెంచె
దివ్య వాసంత శోభలు దెసలు నిండె,
అందుకొనరయ్య మా దివ్య హారతులను,
దిద్దుకొనరయ్య కర్తవ్య దివ్యపథము.

భరత దేశమ్ము నేలెడు పౌరులార,
దేశ సౌభాగ్య సంపద దృష్టి నిలిపి
ఐక్య బుద్ధితో శ్రమియింప నహరహమ్ము,
కురియు మనముందు బంగారు విరులవాన.

---

* టైపిష్టు, రైలన్సులో: హైదరాబాదు.

# మహా శివరాత్రి

మాడ్గుల వేంకటేశ్వరులు *

వచ్చింది శివరాత్రి
వచ్చింది శుభరాత్రి।
ప్రతి సంవత్సరం లాగే
కుతుకంతో వచ్చింది.

పంటలు పండని ప్రజలు ఉపవాసం।
సమ్మెలు చేసే ఉద్యోగులు ఉపవాసం।
ఉద్యోగాలులేని నిరుద్యోగులు ఉపవాసం.

పరమశివుని ప్రళయ తాండవం,
క్షామదేవత విలయ తాండవం।
ఉద్యమ కారులపై పోలీసుల ప్రచండ తాండవం।
మాఘమాసం లోనే మార్తాండుని మహాతాండవం.

ఆకాశాన్ని అంటుకునే ధరలు,
కూటికి లేని బీదల మొదలు।
పార్లమెంటులో ప్రతిజ్ఞల అరపులు.
అన్నీ వింటున్నావా। ఓ శివుడా।
చూస్తూ ఊరుకున్నావా। ఓ భవుడా।
ప్రపంచాన్ని భస్మీపటలం మాత్రం చేయకు,
ప్రజలనంతా కరుణించి, కటాక్షించి, ఉద్ధరించు.

* ఉపాధ్యాయులు, జిల్లా పరిషదున్నత పాఠశాల, చేవెళ్ళ; హైదరాబాదు జిల్లా.

# కర్తవ్య నిర్దేశం

"హాయకర్" *

రమ్మ రమ్మ ఓ పథికుడ!
వేగరమ్మ ఓ రథికుడ!
నా నీతుల నాలకించి
నా పథమున సాగిరమ్మ
రమ్మరమ్మ! నాతోరమ్మ!

విజ్ఞానపు దీపికతో అజ్ఞానపు తమము చీల్చి
సుప్త ప్రజాహృదయాలలో
దీప్తి ప్రసరింప మేలు కొలుపరమ్మ!

అధికారుల అవినీతికి ఎరయై, భువియందునలిగే
హీనుల దీనుల వాడిన
మేనుల శోకమ్మను హరియింప రమ్మ!

పేదరికముతో ఆకలి బాధల కాహుతియయ్యే
దరిద్రులను దరికి తీసి
నిరుపేదల బాధబాప వేగరమ్మ!

దిక్కులేక ప్రజలు మిగులచిక్కిరి, అంటురోగములు
ప్రబలిపోయె, శోకాకుల
ప్రజావళికి సౌఖ్యమ్ములు కూర్చరమ్మ!

దీనులు మతిహీనులు, బలహీనులు మరి అమాయికులు
ధ్వాంతములో చిక్కువడిరి
శాంతిమయము జీవితమ్మ చేయరమ్మ!

గ్రామమ్ముల సర్పంచులు ఘాటుగ తగవులు పెంచిరి,
నరజాతికి వెలుగుచూప
నవపాలన యువపాలన సలుపరమ్మ!

* శ్రీ. ఢాగోజీరావు, అధ్యాపకులు, కేతేపల్లి; మహబూబ్‌నగర్ జిల్లా.

## ఎవడు ?

సంగనభట్ల నర్సయ్య *

మెత్తని గుండెలోన కసిగా కత్తిదింపి
కసులపండుగ చేసికొన్న కర్కోటకు డెవ్వడు ?
చల్లని తల్లి ఒడిలోన చిచ్చు మంటలనురేపి
చప్పుడు చెయ్యక చూసే చెడుగు వెధవ యెవ్వడు ?
చుట్టూరా చీకటిలో పోట్లాడుచు జీవిస్తూ
జిలిబిలి వెలుగులనిచ్చే దీపము నార్పినదెవ్వడు ?
తియ్యని జలమునిచ్చే సెలయేటి ధారలలోన
విషముకల్పి వికవికా నవ్విన వాడెవ్వడు ?
ప్రతిబింబము చూపించే అందమైన అద్దమును
పుటుక్కున పగులగొట్టగ బండను రువ్వినదెవ్వడు ?
వినీలాకాశములోన విచ్చలవిడిగా ఎగిరే
శాంతి కపోతమును బట్టి మెడను నులిమినదెవ్వడు ?
పరిమళాలు వెదజల్లే పువ్వులన్ని గోసివేసి
పాదాలతోడ నలిచిన పాపాత్ముడెవ్వడు ?
వసంతంలా కోకిలమ్మ కమ్మని గానము నాపమని
గర్జించుచు బెదిరించిన గుడ్లగూబ యెవ్వడు ?
పంటగింజలు నాటాల్సిన పచ్చని పొలములోన
విషబీజములు నాటించిన విఘాతకుండెవ్వడు ?
మల్లెపూల పందిరిపై ముళ్ళతీగలు పాకించి
ముళ్ళను గుచ్చంగా చూసి మురిసిపోయిన దెవ్వడు ?

---

* విద్యార్థి, ధర్మపురి; కరీంనగర్ జిల్లా.

## ఓ కవీ!...

దీవి రంగాచార్యులు, బి. ఏ. *

కవితా విపంచికలు డోలలూగిన నేల
తెలుగునాట నాడు వారబోసిరి కవిత
రాజపోషణచే కవిరాజులే విలసిల్లె
రమ్యమైన కావ్యాలు పలురత్నాలుగ భాసిల్లె
కవితకు కైమోడ్చి కవిరాజు మాటల
ఇలరాజుసైతము తలదాల్చిరలనాడు
రాజులెల్లరు గతించె రాజ్యాలు నశియించె
కవన జీవన పథమ్ము కటికనేలగ మారె
రాజకీయ ప్రలోభం మోసులెత్తిన మతద్వేషం
ధ్వజమెత్తెను వర్గతత్వం, కలుషమయ్యెను జనతత్వం
అంతరించె నాశాజీవితం, అలముకొనియె నిశాక్లేశం
ఆవరించె మనోద్వేగం ఆవహించె మహోద్రేకం
ప్రబంధ కవిత్వ ప్రావీణ్యం పలుచలేదు జనజీవన లావణ్యం
కృశిస్తున్న జనసౌభాగ్యావికి శ్రమించాలి నవకవనంతో -
ఓ కవీ!......
జనత మేలుకోరి సమత చాటిచెప్ప
సాగుముందుకు నేడు సాహితీ సేవలో
కూలిలేక కుక్షినిండక కష్టజలధిని యీదలేక
కనలిపోయే మందభాగ్యుల బ్రతుకునిండగ-
వృత్తులుడిగిన విజ్ఞానుల తృప్తులెరుగని శ్రామికాళుల
తృణము మిగులని పాలికాపుల ప్రగతిపథమున సాగిపోవగ-
నల్లబజారున నర్తిస్తూ కల్లబొల్లి మాటలతో
ధర్మంవీడి ధనమార్జించే జనాంధుల కొరక గాలంలా
సాగించు నీ ఉజ్వల కవిత్వం మ్రోగించు శంఖారావం
సాధించు విజయధ్వజం మసలుకొమ్ము కలకాలం.

---

* అధ్యాపకులు, స్వర్ణ, చీరాల తాలూకా; ఒంగోలుజిల్లా.

# కర్తవ్య కలితులు

జి. వీరేశ్వరశాస్త్రి, భాషాప్రవీణ, ఎం. ఏ. *

ఆకాశగంగలో నవగాహనము సేయు
నాసతో నొకనేత యరిగె దివికి;
సత్యమ్మహింసయు శాంత్యాదులను నేర్ప
నరిగినా డొకనేత యమరపురికి;
స్వరాజ్యసులకు ధైర్య సారమ్ము రుచిజూప
బాసినా డొక నేత కేసరియన;
ఆంగీరసునకింక నాలోచనలు చెప్ప
జనినవా డొకనేత స్వర్గమునకు;
సర్వ సర్వం సహాస్తుత చరితులైన
వారి సూక్తులు చేతలు వరవడియయి
భారతీయులు స్వాతంత్ర్య పథమునందు
మెలగుదురుగాక కర్తవ్యత కలితులగుచు

స్వాతంత్ర్య ప్రాప్తికై సర్వస్వమును వీడి
ప్రాణాల నిచ్చిన మాన ధనులు
విశ్వమానవప్రేమ శాశ్వతమ్ముగ జేయ
యత్నమ్ములొనరించునట్టి ఘనులు
సర్వదేశములందు శాంతి సందేశాలు
వ్యాపింపజేసిన భవ్యమతులు
దేశమ్ము రక్షించు దీక్షతో మృత్యువున్
గణనసేయక నిలువగలుగు జనులు
అణువుననువున దేశభక్త్యన్వితాత్ము
లైన భారతవీరుల యమరకీర్తి
నిత్య నూతన దీప్తితో నెగడియెపుడు
మమ్ము కర్తవ్య కలితుల మనుచుగాత.

---

* అధ్యాపకులు, హిందూకాలేజ్ హైస్కూలు; గుంటూరు.

## సీలింగ్

సస్యశ్రీ *

'ఇవేమిటే వింత భయాలు ?'
అవనికీ, ఆకాశానికీ హద్దులు పెట్టి
ఆస్తుల్నీ, అంతస్తుల్నీ అదుపు చేస్తున్నారు!

'ఇవేమిటీ అపస్వరాలు ?'
కలిమి పాతాళంలో పాతిన కాంచన నిక్షేపాలు,
లేమిని చూచినవ్వుతూ లేవిడీ కొడుతున్నాయి !!

'ఆవేమిటా రంగుల నీడలు ?'
అసురసంధ్య వేళ ఆకాశ దీపం ;
గరీబ్ కేల గగనారవిందం !!

'ఎచటికి పోతావీరాత్రి ?'
రక్షకుల దరినుండి రక్షణగల చోటుకు
"సీలింగు"ల ఉరినుండి చీకటి లక్షల చాటుకు !!

* ఎస్. సంగమేశ్వరశర్మ, కేన్ డెవలప్‌మెంటు ఆఫీసర్, ఏటికొప్పాక; విశాఖజిల్లా.

# పచ్చి నిజాలు

ఎ. ఎల్. ఎస్. నారాయణ *

తెలుసు కున్నాను....
ఈనాడే....
ఇప్పుడే....
తెలుసుకున్నాను.

లిప్‌స్టిక్కు పెదాలపై చిందే దరహాసంలో
విషవాయువు ప్రచ్ఛన్న ప్రసరణ కావిస్తుందని....

ఖద్దరు టోపీ ధరించి కారులోన స్వారి చేసి
లాడ్జీ గుమ్మల వద్దకు "పెద్దలు" పోతుంటారని ...

దేశసేవ లక్ష్యమ్మని ప్రగల్భాలు పలుకువారె
దేశోన్నతి కాలదన్ను శత్రుపక్ష హితైషులని....

కర్ణుని ఆదర్శముగా చేసి కబుర్లాడు వారె
కాపురుషులు తామేయగు 'దానశీలు'రుంటారని....

సంఘములో 'సంస్కర్త', పేరు మోసినట్టి వక్త
చీడపురుగువోలె సంఘ నాశన కారకుడగునని....

పదవిలోన నున్నపుడే, పెదవి ఆరకుండగనే
'ధనదాహం' తీర్చుకునే 'జననాయకులుంటారని....

సమయాసమయముల నెఱిగి స్వార్థసాధనమ్మునందు
సత్వరముగ, సక్రమముగ సన్నద్ధులు ఔతారని....

కాని_దీనహీన దలితుణ్ణి, పతితుణ్ణి పీడితుణ్ణి
ఉద్ధరించువారిచ్చట ఒకరయినా ఉండరని....

ఈ పచ్చి నిజాలన్నీ తెలుసుకున్నాను.

---

* రీసర్చ్ స్కాలర్, దక్షిణభారత హిందీ ప్రచారసభ; మద్రాసు.

# హెచ్చరిక

విజిగీషువు *

సమైక్యవాదుల సన్నాయి మేళంలోని సభ్యులకూ
విభజన పరులమండలిలోని విజ్ఞులకూ
సవినయ నమస్కార సహస్రంచేసి—అటూ ఇటూ చూసి,
సామాన్య మానవుడు చేసికోనే మనవి....
ఆకాశాన్ని పక్కలుచేసే అరుపులతో
నభఃకటాహాన్ని ముక్కలుచేసే కేకలతో
ఆర్భాటాలతో, ఉద్భట వివాదాలతో
అలసినాను, సొలసినాను। అబ్బా। ఇకవేగలేను.
వారు వీరౌతున్న ఘట్టాలను కని
వీరు వారౌతున్న ఘడియల్లో మని
ఎలా ఈడ్చటం ఈ జీవితభారాన్ని
భళా। మేలుమేల్। అంతా అయోమయం।
నినాదాల పునాదులమీద వేసిన
నిచ్చెనల నెక్కే నాయకమ్మన్యులారా।
బహుపరాక్। బహుపరాక్। అనే
బరాబరులు కావాలికదా మీకు.
బంగళాలు కావాలికదా మీకు
బంగారం కావాలికదా మీకు
బాకులను బయటికి లాగితే
బల్లాలను అటు ఇటూ తిప్పితే
ఆశించిన ఫలితాలు దక్కుతాయని
అహర్నిశలు అదే ప్రయత్నంచేస్తే
తప్పదు మీ నాశనం వినండిసుమా ।
ఒప్పుతారో ఒప్పరో ఇదే నామాట సుమా।
ఇక ఉంటాను వినండి జాగ్రత్త ।
సకలం సుఖాంతం కావాలి జాగ్రత్త।

* గీట్ల జనార్దన రెడ్డి, క్రాంతి సంపాదకుడు, గోదావరిఖని; కరీంనగర్ జిల్లా.

# ఎక్కడుంది ప్రశాంతి ?

కొలనుపాక మురళీధరరావు *

ఎందుకిలా జరుగుతుంది?
ఇంకా ఎన్నాళ్ళిలా ఉంటుంది?
చావుపుట్టుకలకు సుఖదుఃఖాలకు
ఎక్కడుంది మూలకారణం?
జీవనస్రవంతి ఈ రీతిగ
సాగిపోవలసినదేనా?
ఈ విధంగ గడచిపోవలసినదేనా?
దేవుడు, దైవం పూజలు పునస్కారాలు
గుళ్ళు గోపురాలు మసీదులు మందిరాలెందుకు ?
రక్తాభిషేకం బలిపీఠా లెందుకు ?
మానవత్వం, మమతలను నేర్పని మతాలెందుకు?
మంచితనం మనిషినిచూసి
పారిపోతూంది ఎందుకు?
దానవత్వం దావానలంగా
పెరిగిపోతూంది ఎందుకు?
శాంతి సౌఖ్యాలు కనుమరుగవు తున్నాయెందుకు?
రోజు రోజుకు మనుగడ
బరువై పోతూంది ఎందుకు ?
మంచికి మనసుకు జరిగే సంఘర్షణ.
మనిషికి మమతకు కలిగే సంఘర్షణ
స్వార్థానికి పరోపకారానికి జరిగేఘర్షణ
చివరకు మనిషికీ మనిషికీ జరిగేఘర్షణ
ఎవరు తెలుసుకుంటారు? ఎందుకిలా జరుగుతూంది?
ఇంకా ఎన్నాళ్ళిలా ఉంటుంది? ఎక్కడుంది ప్రశాంతి?
మనసులలోనా, మనుషులలోనా? ఎక్కడఉంది ప్రశాంతి?

---

* రామగిరి; నల్లగొండ.

# రామరాజ్యపు మాట

పి. వి. డి. రామచంద్రుడు *

కులముపేరు చెప్పి ఓటుకొని
జాతిపేరు చెప్పి గద్దెనెక్కి
కులమత జాతిభేదాలు కూడదందురు.
రామరాజ్యపు మాట నేటిమేటి నాయకుల బాట!

బరువు బాధ్యతల మధ్య
మరచి పోతి మన్నింపుడనుచు
పన్నులెగవేసి; పార్టీ పెద్దలై
దేశమేలెదరు కొందరు. ||రామ||

గ్రామసీమలె దేశానికి జీవగర్ర
పల్లెప్రజల సౌభాగ్యమునకై
పాటు పడుదు ననుచు
పట్నములలో తిరుగుదురు
ప్రజా ప్రతినిధులు; వింతగాదె! ||రామ||

అవిద్యయె అజ్ఞానమునకు
మూలకారణము; విద్యనంతయు
నే సంస్కరించెద ననుచు
గద్దెనెక్కు విద్యా విహీనుండు
ఏమి దౌర్భాగ్యమీ భరతమాతకు. ||రామ||

రాజభరణాలు రద్దుజేయుట
సామాన్యుని సౌభాగ్యము కొరకే ననుచు
ప్రజా ప్రతినిధుల భరణాలు
పెంచుటేల? ప్రజల యిక్కట్లు
పెడచెవిని పెట్టుటేల? ||రామ||

* స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా; అమలాపురం.

## ఎద ఎదలో ఉషస్సు

ఇవటూరి కామేశ్వరరావు *

ఎద ఎదలో ఉషస్సు కను, కనుడదే ఉషస్సు
పసిపాపల లేత చిరునవ్వుల్లో ఉషస్సు
పాలతోటలవికసించే పుష్పాల్లో ఉంది ఉషస్సు
యౌవన మందార కాంతి మరీచికల్లో ఉంది ఉషస్సు
ఆవేదనోద్భూత జీవన కాసారంలోకూడా ఉషస్సు
జలపాతోద్భూత సంగీతంలో నిండా ఉషస్సు
మదీయ గేహాంగణంలో తారాదే ఉషస్సు
ఉషస్సు, ఉషస్సు అంతటా ఉషస్సు
ఉషస్సు లేనిదే చైతన్యంలేదు,
ఉషస్సు రానిదే భవితవ్యం లేదు
ఈ సువిశాల విశ్వ పరీవృతం ఉషస్సు
భయోద్విగ్నజ్వాలా వలయంలోంచి
పూర్వదిశా విశాల గగన భాగంలోకి ఉషస్సు
నాలో, నీలో ఉంది ఒక ఉషస్సు
నవనీతం కన్న గొప్పదా ఉషస్సు
ఉషస్సును మరచి, కసిరే
మసిలే, మానిసుల యెదల్లో
తమస్సు బుసలుకొట్టి
రుసరుస లాడుతుంది,
ఓ ఉషస్సుమ బాలా!
నవ్యోషస్సుమహేలా!!
నీ యమృత కిరణప్రసారం అందించి
వారిలో స్పందింపజేయు సతతం చైతన్యధార
ఎద ఎదలో ఉషస్సు కను, కనుడదే ఉషస్సు.

* హిమాయత్‌నగర్; హైదరాబాదు.

## వస్తాయా ఆ రోజులూ!

"కేసరి" *

వస్తాయా ఆ రోజులూ
తెస్తాయా ఆ మోజులూ
భారత జాతీయోద్యానంలో
పూస్తాయా విరజాజులూ
ఇస్తాయా ఆమోదములూ
సురుచిరసుందర జాతి సుమమ్ములు
విరబూచిన మన భరతోద్యానం
పరపాలన శిశిరపాతమున
మరుభూమిగనే మారిపోయెనా
వీర పూజకై విరిసి తరించిన
మందారమ్ముల మాలికలేవీ
జాతీయత నిలపై వెదజల్లిన
మల్లెలమొల్లలు మాలతులేవీ
కడలిదాటి ఖండాంతరమ్ములను
సిరులను నింపిన సంపెంగలేవీ
చిరునవ్వుల చిన్నారి మోములను
మురిపించే విరజాజులవేవీ
యుగ యుగాలుగా శాఖలల్లుకొని
నిలిచిన మూల మహీజములేవీ
తరతరాల నవకుసుమ మంజరుల
విరియించిన సుమవల్లులేవిరా
మల్లె మందారాలు మరల వికసించాలి
విరజాజి సంపెంగలు సిరులు పండించాలి
మేలి పుష్పములేర్చి మాలగా జతగూర్చి
అమ్మ పాదాలపై అర్పించి తనియాలి.

---

* పి. ఎల్. నరసింహశాస్త్రి, తెలుగు లెక్చరరు; అమలాపురం.

# వినతి

కమలేకర్ రాంచంద్రజీరావు *

ఓ నవభారత జననీ! మా జయ భారత జననీ!
నీ గణ తంత్రపు ప్రాంగణమున నిలుచున్నది నీ సంతతి యావత్తూ-
నిరాశా-నిస్పృహలను శ్వాసిస్తూ, నీ యాశీస్సుల పొందాలని ఆశిస్తూ!
సోషలిజం తెస్తామనెడి కంఠశోషలిస్టుల లిస్టు పెరుగుతోంది!
శోషవస్తోంది మాకు ఈ నిరంతర ఘోషణలూ, భాషణలూ వింటూ!
మంటలు-ధరల మంటలు మింటికెగసి పోతున్నాయి!
మరి-ఆ వేడికి వాడిన మాఆశల విరులన్నీ ఆవిరులై పోతున్నాయి!
సోమునిలా-కృష్ణపక్ష సోమునిలా-చిక్కి పోతోంది సామాన్యుని జీవనం!
నాయకులు-వినాయకులై పోతున్నారు!
సామాన్యులు-వారికుంద్రాళ్లై పోతున్నారు!
కంచెలే చేలను మేసేస్తున్నాయి!
గుళ్ళూ, గుళ్ళోని లింగాలూ మ్రింగబడుతున్నాయి!
స్టేటుమెంట్ల పేవ్‌మెంట్లపై సాగిపోతున్నారు-మంత్రులూ, కుతంత్రులూ!
వాటిని పత్రికల్లో చూస్తూవిస్తుపోతున్నాయి-సజీవాస్థి పంజరాలు!
కోట్లకోట్ల నోట్లకట్టలేమో-ఆ వినాయకుల
కోట్ల జేబుల చీకటి కొట్లో కట్టుబడి పోతున్నాయి-
చీకటిలో-అవికూడా నల్లబడి పోతున్నాయి!
చింతల వంతల మా బ్రతుకులు-చతికిలబడి పోతున్నాయి!
చితికి-చితికి పోతున్నాయి, చితికై ....సాగి పోతున్నాయి !
ఎప్పుడమ్మా-యీ స్వహాతంత్రానికి నిష్కృతి?
ప్రసాదించుతల్లీ! మా సమస్యలకు పరిష్కృతి!
అన్నపూర్ణవు, ఆది శక్తివి! ఆలకించు మా వినతి !

---

* ప్రభుత్వోన్నత పాఠశాల; మహబూబునగరం.

# మధురానుబంధం

టి. శ్రీరంగస్వామి *

నీకూ నాకూ ఉందీ
అదే తెలియని మనలోని
మృదు మధురాను బంధం
ఎక్కడిదీ మధురాను బంధ్వ?

నిన్న మొన్నటి వరకు
నీ వెవరో నేనెవరో
నీ వెక్కడ జన్మించావో
నేనెక్కడ జన్మించానో
కాని నేడు మనలోన ప్రవేశించింది
మన మధ్యనేదో తెలియని ఆత్మీయతానురాగం.

నీతో ఎన్నో చెప్పాలని
నీకు దగ్గరగా చేరాను.
కాని ఎందుకో చెప్పలేక
అంతరంగాన ఉండి పోతున్నాయి.

ఈ సందిగ్దతా సంశయం
నుండి తేరుకోలేక
నిను విడిచి
పోలేక పోతున్నాను

అదే మనలోనున్న
అయస్కాంతానుబంధం
మనలో మరుగున పడిన
మృదుమధురాను బంధం.

---

* వెలేరు; వరంగలు జిలా.

# ధర్మధేనువు

భూపతిరావు రాజేశ్వరరావు *

గోహత్యలు! గోహత్యలు!! ఎటుచూచినా గోహత్యలే
స్వార్థపరులైన దుర్మార్గులు
అన్యాయాల హత్యలు చేస్తున్నారు.
బాధిస్తే పశుత్వం కలిగిస్తుందని,
పూజిస్తే కల్పతరువై నిలుస్తుందని,
వేదాలు ఘోషిస్తున్నా వినకుండా_
మానవత్వానికి 'గోరీ' కడుతున్నారు
గోస్వభావానికి విషం పెడుతున్నారు
కంచెలే చేలు మేస్తున్నాయని
కామధేనువాక్రోశిస్తున్నది.
అజ్ఞానాంధకారపు మరుగు స్థలాలలో
సంకుచిత స్వభావపుటిరుకు యంత్రాలగదుల్లో
పేరుకుపోయిన స్వార్థ పంకిలపు గృహాలలో
క్రౌర్యంతో ధర్మగోవుల హింసించే
కసాయి వాళ్ళ సంఖ్య పెరిగింది.
కత్తి మెడపైగల గోవు కన్నీరు విడిచింది
ధర్మమూర్తి అశ్రుపతనంతో
దావానలం జ్వలించింది.
పరాన్నమనే పాపమాంసాశనంపై
పలువురు మక్కువ పడుతున్నపుడు
హత్యలు జరుగకుండా చూడడం
అధికారంతో సాధ్యమే నంటారా ?
గోవువంటి మానవతను రక్షించుటకు
ప్రతి మనిషీ గోపాలుడు కావాలని
భారతాంబ వాంఛిస్తున్నది ;
మంచి మార్పుకై నిరీక్షిస్తున్నది.

---

* అధ్యాపకులు, జిల్లా పరిషదున్నత పాఠశాల; కొత్తపల్లి.

# బ్రతుక నేర్చుకో

ఐ. వి. కె. భగవాన్‌రాజు *

నీలోని పిరికివాణ్ణి
నిలువునా పాతిపెట్టి
నీలోని సాహసిని
గెలువగా ముందునెట్టి
సాగిపో.... వెనుదిరగక
సాగిపో.... సాగిపో....

కంచువంటి కంఠమెత్తి
మంచునంత కరగించగ
మనలోని మంచివాడు
కలలోనివాడు కాదని
కల్ల అసలే కాదని
పాడుకో.... దిక్కులెల్ల పిక్కటిల్ల
పాడుకో.... పాడుకో....

నవశకారంభంలో
నవ్యజీవనాన్ని ప్రారంభించు
మంచి అంతట వెల్లివెరియాలని
మనిషి మరణించరాదని
మనీషిగా బ్రతకాలని
కోరుకో.... కోటి వేల్పులను
కోరుకో.... కోరుకో....

మంచిలో చెడు ఉంది
చెడులోమంచి ఉంది
మంచిలోని మంచిని
చెడులోని మంచిని
వడబోసి, ఒకటిగాచేసి
నేర్చుకో.... బ్రతకడం
నేర్చుకో.... నేర్చుకో....

---

* ఫిజిక్స్‌శాఖ, పోస్టు గ్రాడ్యుయేట్ సెంటరు; వరంగల్లు.

# నాగరిక ప్రపంచం

రేవూరు అనంతపద్మనాభరావు, ఎం. ఏ. *

నాగరిక ప్రపంచాభివృద్ధికి తార్కాణాలు
నారీమణుల అర్థనగ్న వస్త్రధారణలు!
ప్రబంధాల్లోని విరహిణుల 'సిస్టర్లు'
ప్రతిరోడ్డు చివరనా 'వాల్‌పోస్టర్లు'.

ప్రతి విద్యార్థికీ హస్తభూషణం
పుస్తక విక్రేతల నిండు భోషాణం
క్రొత్తదనం కోరుకొనే ప్రజావాహిని కమృతం
కోట్లకొలది డిటెక్టివుల ప్రచార మలయమారుతం.

శృంగార మాసపత్రికలు సమాజంలో విక్రమించాయి
సాహిత్య మాసపత్రికల స్థానాన్ని ఆక్రమించాయి
వేలకువేలు మదన పరతంత్ర పత్రికల అమ్మకం
వేలంవెర్రి మొగాలైన యువకుల కుద్రేకం.

రామదాస కీర్తనలపై శాపనార్థాలు
సినిమా పాటల్లో వినిపించే ద్వంద్వార్థాలు
రేడియోల్లో నిలిచిన శాస్త్రీయ సంగీతం
సినిమాల్లో మలచిన ప్రణయ సంగీతం.

నిలువెత్తునా పెరిగిన నిరుద్యోగులు
పేచీలు పెరిగిన సహోద్యోగులు
ప్రతి ఆఫీసు గుమ్మానికి చేరువ
లంచగొండి చీమలబారులు.

నాగరిక ప్రపంచాభివృద్ధికి తార్కాణాలు
నగ్నలైట్లనే నరహంతకుల దారుణాలు!!

---

* తెలుగుశాఖ, ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి; కందుకూరు.

# అన్వేషణ

జగన్మణి *

ఎంత వెతికినా అంతులేదుగ
ఆదీ అంతూలేని జగమొక వింతగ॥

నోరులేని గంగిగోవు పొదుగు నెలా నింపెను
ఆ పాలు త్రాగవలెనని లేదూడ కెలా తెలిసెను
పిచుకమ్మకు గూడుకట్ట నెవరు నేర్పిరి, ఆ
గూటిలోన గ్రుడ్లు పొదుగ నెవరు చెప్పిరి?

చీమచేయు పనియేమొ-ఎవరికేమి యెరుక।
ఆమె సామెతె మనకి తలమానికగ।
కదలలేని చెట్టుకొమ్మ-ఎదిగి యెలాపూచెను।
ఆ పూలలోన సౌరభమ్ము-తాను యెలాతెచ్చెను।

కనులు కనులు కలసినచో కలుగు భావమేమి
ఆ భావమునకు పరువమందు పలుకు భాషయేది।
కలువ భామసైగకు-ఆ చందమామ రాకకు
ఏమి మధుర బంధము। అదియెప్పటి బాంధవ్యము।
ఎవరివలన 'ఉదయమగును।' దిక్కు-లెలా వెలిగెను।
ఆ'సంధ్య'పొందుగోరు నాతడెవరి బంధువు।
తల్లికి తనబిడ్డపైన ప్రేమ యెలా కలిగెను
ఆమె ప్రేమలో యెందుకు జగమంత ఊగెను।
తరతరాలుగా యెందరొ తరచి చూచిరి
తా మెవరొ తెలియలేక తికమక పడిరి

---

* జి. వేదాంతం, ఎల్. ఐ. సి. జీవనప్రకాశ్; హైదరాదాదు.

## శ్రీశ్రీ వింటే?

చలం *

ఒక్కొక్క క్షణం—ఒక్కొక్క యుగం
అదో అంధకార బంధురం
ఇరవై సంవత్సరాల
నా ఇరుకు జీవితం!
ఏమిటో ఈ జీవితధ్యేయం?
నిరుద్యోగ సమస్యతో
నిరుపేద నిట్టూర్పులతో
నిరాశావాదంతో
నిలకడలేని జీవితం!
అధికారుల నిర్దయలో
ధనాంధుల నిర్దాక్షిణ్యంలో
కసాయిగుండెల కార్ఖానాలో
మటమట మాడింది
మానవత్వం చచ్చింది.
ఎండమావులని తెలిసీ
ఎందుకీ ఆవేదన?
ఎండువారిన జీవితంలో
ఎందుకింకీ కుస్తీ?
ఏంచూసుకొని బ్రతకాలి?
ఎవరి అండతో నిలవాలి?
తోడు నీడలు లేనినాకు
ఇంకేముందీలోకంలో?
ఇదో విషాదగాథ
ఎవరికి కావాలీ బాధ
ఇ... ద.... న్.... తా....
ఏ శ్రీశ్రీయో వింటే
కుక్కపిల్లలా అగ్గిపుల్లలా
కవితావస్తువవుతుంది!
ఆ ఒక్కక్షణం—నాకో మధురక్షణం

* పి. వేంకటాచలం. ఎల్. ఐ. సి. జీవనప్రకాశ్; హైదరాబాదు.

# నాకు తెలియని నీవు

కె. ఆర్. కె. మోహన్ *

నీ కన్నులలో చల్లని వెన్నలనే చూశానుగాని
ఆ వెన్నలచాటున ఉన్న వేడిమిని తెలుసుకోలేకపోయాను
నీ మెత్తని గుండెలలోని మత్తును అనుభవించానుగాని
ఆ గుండెలమీద వారిన బీటలు చూడలేకపోయాను
నీ తియ్యని వాక్కుల తేనెను కడుపారా గ్రోలానుగాని
ఆ తేనెలు కప్పి ఉంచిన చెడును కనిపెట్టలేకపోయాను
సముద్ర మధ్యంలో కొండలా నిలిచిన నిన్ను చూశానుగాని
నీవు ఆ అలల తాకిడికి నలిగిపోతున్నావని గ్రహించలేకపోయాను
నిండుగా నవ్వే నీ ముఖాన్ని నిత్యమూ చూశానుగాని
నీ లోలోపల రగిలే దావాగ్నిని కానలేకపోయాను
అందరికీ పంచి ఇచ్చే ప్రకాశాన్ని నీలో చూశానుగాని
నీలో నీవు కరిగే క్రొవ్వత్తి వనుకోలేకపోయాను
నీ శక్తినే తైలంగా వెచ్చించి నీ జీవితాన్నే
ఇతరులకోసం అర్పిస్తున్న నీవు ఎవరవో
నేను ఎలా తెలుసుకోను ?

* అసిస్టెంటు పోస్టుమాస్టర్, జూబిలీ హెడ్ పోస్టాఫీసు; హైదరాబాదు.

## మాట్లాడే మంటలు

ఎ. విజయరామ శర్మ *

ఇది, నామనస్సు పాడుతున్నపాట
సమాజం ప్రబోధించిన బాట
కలాన్ని, గుండెనెత్తురులో ముంచి రాస్తున్నమాట.
ఇక్కడేవో, ఆకారాలు కదలాడుతున్నాయి
తమలో మంతనాలాడు కుంటున్నాయి
ఆ చేతుల్లో ఏవో ఆయుధాలు
దేనికైనా తెగించే దురంధరులు
వాటిజోలికి వెళితే మిడతలా భస్మీపటలం।
జగమంతా కాటుకలా పేరుకున్న చీకటిలో
ఎర్రని మంటలు మంటల్లో మారణహోమం
అంతటా ఆకలిఏడ్పులు। చలిమంటల గాడ్పులు।
జగం మండిపోతుంది నాదం పల్కుతుంది
శ్మశానం ఆహ్వానిస్తుంది
నక్కల అరపులు గుడ్లగూబ చిలుకపల్కులు।
మిన్నగా విషపునాల్కలు।
అన్నార్తుల ఆకలిదాహం
మంటల పంటల భుక్తం।
క్షుద్రశక్తుల పైశాచిక గురుతులు
కడుపులో ఆకలిమంట।
కళ్ళలో దైన్యపు పంట।
పైశాచిక గుండెగానుగలో నలిగిపోతున్న అమాయకపుపీనుగ।
నాగుండె మండి, ఎడారిలా ఎండిపోయింది
నాకలంలో సిరా అయిపోయింది
గుండెలో నెత్తురు ఆరిపోయింది
ఇవే, నేనుపల్కే మాట్లాడే మంటలు.

---

* ఫూర్డీకర్ బాగ్, హిమాయత్ నగర్; హైద్రాబాదు.

# అన్నకు...ఒక విన్నపం

భిన్నూరి అనంత కృష్ణమూర్తి *

అన్నా....! నీవంటున్నది
వాస్తవానికి దూరం
అన్నా....! నువు కంటున్నది
'మేడిపండు' పచ్చి నిజం.
అన్నా....! నీవు తింటున్నది
కమ్మనైన తీపి విషం
అన్నా....! నీవు ధరించినది
నూతన వర్ణం పులుముకొన్న మలిన వస్త్రం
అన్నా....! నీవారోహించినది
మొగలి పూవుల రథం
అన్నా....! నీవంటున్నది
ఊహాలోకాల హర్మ్యం
వాస్తవాన్ని విస్మరిస్తూ
గాలిమేడలెన్నో నిర్మిస్తూ
ఎందుకిలా....నీవు
ఉన్మాదంగా తిరుగుతావు
ఎన్నాళ్ళిలా....నీవీ
ముత్తులోన తూలుతావు
వలదన్నా....వలదు; నీకా మోహం వలదు
వదులన్నా....వదులు; నీవా మైకం వదులు
పగటి కలలన్నిటినీ—పాతాళంలోత్రోసి
నీకున్న ప్రతిభతో—నీ దేశానికి కొంతైనా
సేవచేసి వెలుగొందు—సుఖమన్నది ఉంది....అందు.

---

* నల్లకుంట; హైదరాబాదు.

# మూగవోయిన రాగభావం

సత్తిరాజు నరసింహారావు *

ఏదో చెప్పాలనే కుతూహలం
పసివాని కేరింత కల్గించినకోలాహలం
బోసినవ్వుల భావాలేమిటని
పసిడి పులకింతలతో గుసగుసలాడాలని
పెల్లుబికే ఆపేక్షల ఉత్కర్ష
కలలో పులకింతలొలికించిన కమనీయ భావం
భాషతో చేయలేని ముద్దులొలికే రాగం
మస్తిష్కంలో ఉరకలువేసి పొంగింది
అధరాల క్రింద అణగి అంతరించింది
మూగవోయిన అనురాగ గీతిక
మనసులోనే మిగిలిందొక కోరిక.
మాటలకందని ఊహలు
కళ్ళలో తొణికిసలాడే మోహాలు
పెదవిపైకి రాలేనిరాగాలు
కళ్ళతో చేసాయి సరాగాలు.

---

* ఎల్. ఐ. సి. అసిస్టెంటు, జీవనప్రకాశ్; హైదరాబాదు.

# అదిగో! వచ్చుచున్నది

షైలాక్ *

షైలాక్‌ను నేను షైనెస్ లాక్ చేసి మీ ముందు వచ్చాను,
స్కైలార్కులా కమ్మని గీతిక వినిపించను, కఠోరనగ్నసత్యాలను వెల్లడించి
సకాలానికి మసాలా అంటేలా చేస్తాను.
గళమెత్తి పాడలేను కరమెత్తి వ్రాయలేను,
గరళము కరవాలమును చూసి
పరరాజ్య పీడనము వదిలినా
నేటి స్వతంత్ర ప్రజాపాలనలో పరపీడనము తొలగలేదు
ఇది డెమోక్రసీగాదు, డెమన్-ఓ-కసియేగాని
దేశమును ప్రేమించుమన్నా మంచి అన్నది 'పెంచుమన్నా'
మంచిని కంచికిపంపి, వంచనను పెంచి
స్వదేహమును ప్రేమించి స్వలాభము నాశించడం మరచిపోలేవా ?
ఇంటగెల్చి రచ్చగెల్వమన్నారని, కాలుదువ్వి కదంత్రొక్కి రచ్చకీడ్చి రభసచేసి
స్థానబలిమి సంఖ్యాబలాలతో (వి)నాయకులు
మూలనున్న ముదుసలిపై పోరుసల్పుట ఎంత హాస్యాస్పదము ?
నందిని పందియని కాకిని కోకిలయని చెప్పగానే
డూడూ బసవన్నవలె తలలూపు ప్రజ ఉండగా
చిత్తము వచ్చినరీతి ప్రవర్తించు ప్రజా (వి)నాయకులకు ఎదురుచెప్పగ తరమా,
పశ్చిమాద్రిన సూర్యుడుదయించినను ఉదయించవచ్చు
మహాసముద్రమందలి నీరు ఇంకినను ఇంకవచ్చు
ఆరు నూరైనను నూరారైనను ప్రజానాయకుల పదవిమత్తును వదలించగలమా ?
ప్రజలను కబళించు ప్రజాపీడకుల పనిపట్టగ
నిద్రమత్తువీడి, నిర్వీర్యత వదలి, నిర్భయముగా
పోరాడు శక్తికలిగి మందబుద్ధితొలగి ప్రజలలో
చైతన్య ప్రవంతి కలుగు సుదినము వచ్చుచున్నది అదిగో వచ్చుచున్నది.

---

*డి. సి. డేనియల్‌బాబు ఎల్. ఐ. సి. జీవనప్రకాశ్; హైదరాబాదు.

# "ఏడుకొండల దొర!"

ఏడిద కామేశ్వరరావు *

ఏనాడు నినుచూచినానో నాతండ్రి
ఈ నాడు నిను చూచినట్లుండును—
ఏనాడు నిను మరువలేనూ, నా ప్రభూ
ఏనాటికిని నీవె నా దైవము ॥ఏ॥

ఏడుకొండల నిట్టె ఎక్కించినావు
ఏడులోకాల వైభవమంత చూపావు
ఏడుగడ నీవెయను వెలుగునిచ్చావు
ఏడేడు జన్మాల ఏలుకో నా ప్రభూ—
—ఏనాటికిని నీవె నా దైవము ॥ఏ॥

ఏడు ఏడుల బ్రతుకు వెళ్ళదీశాను।
ఏడు జానల వాళ్ళకై తుళ్ళినాను
ఏడు ఏడుల వెనుక ఏమున్నదోచూడ
ఏమి కనపడదయ్యా ఎంత వెదకిననూ—
—ఏనాటికిని నీవె నా దైవము ॥ఏ॥

ఏమొ వ్రాసితినయ్యా, ఏమొచేసితిని
లోకోద్ధరణకే అంతచేసినానంచు
భ్రమపడి నేడిట్లు దిగ్భ్రమను చెంది
కనుదెరచినానయ్యా, నిన్ను చూచుటకే—
—ఏనాటకిని నీవె నాదైవము ॥ఏ॥

ఏడు కొండల దిగువ ఏమున్నది?
ఏడు పాతాళాల బరువున్నది।
ఏడుకొండలమీద నుండనీవయ్యా
ఏడుకొండలదొరా, వేడుకొందయ్యా—
—ఏనాటికిని నీవె నాదైనము ॥ఏ॥

---

* రేడియో అన్నయ్యా, ఆకాశవాణి; విజయవాడ.

# నీవు జీవించాలి

గంగసాని పద్మారెడ్డి *

ఓ మనసున్న మనిషీ !
నాగరిక ప్రపంచంలో, నవ్వులపాలవుతున్నావనే భయంలేదు
జీవించినన్నాళ్ళు జీవించు మంచిగా ఆత్మాభిమానం గలవ్యక్తిగా
వ్యక్తిత్వానికి విలువలేదనకు,
వన్నెలీను వక్రతత్త్వాల వంచన బ్రతుకుల
ఈ క్రుళ్ళిన సంఘం దుర్వాసనలతో భయంలేదునీకు
నీవే సంఘాన్ని తయారుజేశావు,
సంఘం నిన్ను తయారు జేయలేదు.
ఈ నగ్న సత్యం మరవకు
ప్రపంచం మారేతీరు ప్రతిజీవీ కోరేతీరు
అవధులులేని ఆకాంక్షలకై అసువులనిలిపే అన్నం కొరకై
అనర్థాల లాలనలో కొట్లాడే ప్రజలు
ఈ సంఘం స్థితిజూస్తే ఆలోచనలు లేస్తాయి
ఆవేదనతో ఆక్రోశంతో.... ఎటూతెమలలేక నిలబడ్తావు.
పిరికివై జీవితం చాలించాలన్న భయాన్ని బ్రతకనీకు,
కళ్ళుతెరచి, ఒడలువంచి జీవనవీణాశృతుల సవరించి,
ఈ పురాణ, ఘరానా సంఘాన్ని, వ్రేళ్ళతో పెకిలించి
సర్వజన సుఖంకై, స్వసుఖంవిడిచి
వంచనలను వంచించి మంచిని పెంచి
మనిషి మనసులో మనోనైర్మల్యత్వాన్ని స్థాపించాలి,
ఓ మనసున్న మనిషీ! నీ సహకారం కావాలి.
మమతాను రాగాలు, పంచి, పెంచే
మంచిమనిషిలా – మహామనిషిగా –

---

* ఘనుమకొండ; వరంగల్లు జిల్లా.

## "నా ఉగాది"

సాలగ్రామ్ *

చిచ్చు నిండిన గుండెలోనుండి విచ్చుకుంటున్న పదాలివి।
ఏ ఉగాది పచ్చడి రుచులూ లభించవిందులో.
అవిచ్ఛిన్న కాల ప్రవాహంలో అలాగే కొట్టుకుపోతున్న అన్నార్తుల
భిన్న హృదయాలకు అద్దం పట్టాలనుకుంటున్న యదార్థాక్షరాలివి।
పంచభక్ష్య పరమాన్నాలతో పసందైన విందుచేయవివి.
నాటికీ, నేటికీ కూడా కూటికిలేక బీడుబ్రతుకుతో మోడై నిల్చున్న
బడుగువారి బడబానల మిది।
నవనవోన్వేష శాలినియై సాగే వసంతాల మలయానిలం కాలేదది.
ఆశలుడిగి, భాషలేని తపనతో, కంపించే గొంతులో
అలాగే అణగారిపోయిన దీన విలాపమిది.
కొత్త చిగుళ్ళు మెక్కి, పూల గుత్తుల మాటున
దాగున్న మత్తకోకిల ఎత్తుకున్న
మధురాలాపన అంతకంటే కాలేదిది।
నా కవిత్వంలో ఇవేవీ సృష్టించని,
నాలో కొత్తగా దేనినీ చిగురింప జేయని
ఈ సరికొత్త ఉగాదిని ఏ ఆనందంతో కనను?
ఏ నవ భవితవ్యానికిది పునాది అనను?
ప్రకృతి పల్లవిస్తే ఉగాది వచ్చినట్లేనా?
కొత్తగా ఏ మనసులు పల్లవించాయని?
ఆశలుతీర్చి, ఆవేదనమ ఆర్పి బ్రతుకును పులకింపజేసే ఉగాది కావాలి.
సమతా గీతాన్నాలాపించే వాసంతాన్నీ-
సామ్యవాదాన్ని పుష్పింపజేసే వసంతాన్ని తేవాలి
మనిషిలో, మనసులో వెలసే ఉగాదిరావాలి
ఇది ఆ ఉగాదికోసం నిరీక్షణ।
నేనాశిస్తున్న ఆ నవయుగ నాందికోసం అన్వేషణ.

---

* లెక్చరర్, ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజ్; మహబూబ్‌నగర్.

# ఉషస్సంరంభం

టంకసాల గోపీనాథ్ *

మోకరిల్లదగిన పరమ కరుణామయుణ్ణి
మేకులుకొట్టి చంపి ఏమంటూ పుట్టిందో
ఈ "క్రీస్తు" శకం ఇరవై శతాబ్దాల క్రిందట –
నాటినుండి నేటివరకు–అకటకటకటా!
నరచరితం పాడిందేపాట
పూర్ణ పురుషులను వెదకివెదకి వేట.
రెండు శతాబ్దాల క్రితం సమతాధ్యక్షుని
ప్రేల్చిన శబ్దా "లింకన్" వినిపించునుకదా!
రెండున్నర శతాబ్దాలకుముందు
ప్రేమదేవతను "బాపు"రే, రూపుమాపినప్పటి
థాంథాం కృతులు, రామ్ రామ్ ధ్వాన తరంగవలయాలు
ఢిల్లీ కేంద్రంగా–గిరగిర సుళ్ళుదిరిగి
దిక్చక్రందాకా గింగురు మనడంలేదూ?
సమతాకామి, మానవతావాది, శాంతి "కింగు" వ్వలాంటి
గాంధేయుణ్ణి కడతేర్చింది మొనమొన్న మూడేళ్ళనాడు కాదూ?
మనమిం "కెన్నడీ" జగద్బాంధవుల అడుగుజాడల బడినడిచేది?
మరింకెన్నడీ "నిక్షణ" లోకకంటకుల వీరపూజమాని వీరి పీచమడచేది?
శిష్ట శిక్షణకు దుష్ట రక్షణకు ఇదే ఇదే చరమ శ్లోకం
చరిత్రా ప్రవాహాన్ని కారుచీకట్లోంచి వెలుగు జైళ్ళకు మళ్ళిద్దాం?
పాశీగునపంతో నిశీథపు మసీదుల్ని కుళ్ళగించి పెళ్ళగించి
క్రాంతి ఉషస్సును విడిగిద్దాం?

---

* హైదరాబాదు.

# మరువీచిక

మురింగంటి లక్ష్మీనరసింహాచారి *

సఖినెఱి చూపులలో
సైగ లొలుకు తొలకరి
వయస్సు కవ్విస్తే
నా యెద పరుగుతీసె.

చెలియ చేలాంచలము
చలిగాలి వీచితే
చలిమంట రేపితే
చిలిపి కౌగిలి యిస్తా.

అలివేణి వేనలిని
అలరించిన అలరుల
మాలికలు మరుమల్లి
యలై గిలిగింతలిడె.

ఓ! నవ మందహాసినీ
చిగురాకు పెదవి
పై చిందులాడు లే నగవుల సుహాసినీ!
నీ నవ్వుల పువ్వుల నవ సౌరభాలు
సోకి పలకాక రేగ తనువు పరవశించెనే.

మధురం మధురం నీ అధరం,
విరితేనెల పొదరింటదాగు నీ పలుకు మరీ మధురం.
పయ్యెదపైన వాలి నీ యెదపైన సోలి
కౌగిళ్ళలో తేలిపొమ్మంది మరుగాలి

ఈ చక్కని చుక్కలవేళ జాగేలనే?
ఈ ప్రశాంత వసంతవేళ జాలమేలనే??
నీటు సొగసుల లాలనలో కరిగించవే!
బాల! ప్రణయాబ్ధిలో ఓలలాడించవే.

---

* అధ్యాపకులు, మునిగలవీడు; వరంగలు జిలా.

# ఈనాటి యువకుడు

ఏ. పురుషోత్తమరావు*

ఆశలో జీవిస్తూ నిరాశలో నిదురిస్తూ
అన్యాయాల నడిబజారులో వగరుస్తూ
అర్థంకాని ఆవేశంలో పరుగులు తీస్తూ
పడుతూ లేస్తూ నడుస్తున్నాడు ఈ నాటి యువకుడు.

అనుకున్నది చేయలేక, అనుకోనిది భరించలేక
అనుక్షణం అగాధంలోకి తొంగిచూస్తూ
అటూ ఇటూ కొట్టుకుంటూ, మాటి మాటికి
తిడుతున్నాడు తిట్టుకుంటున్నాడు.

గమ్యం ఎటుందో తెలీక అగమ్యంలో అంధకారంలో
మృగ్యం అయిన భావనాలోకంలో,
కన్ను పొడుచుకున్నా కనరాని కీకారణ్యంలో
తన్నుకుంటున్నాడు, తడుము కుంటున్నాడు.

డిగ్రీ కాగితాలకు డిగ్నిటీ ఏనాడో పోయిందని
నో వెకన్సీ వెనుక కరెన్సీ విలువ పెరుగుతుందనీ,
క్లాసురూం నుంచి కాన్వొకేషన్ వరకు కాలక్షేపం తప్ప
క్లాసు ఫోరుకు కూడా పనికి రాదని
నిజం తెలుసుకున్న నిరపరాధి నీరుగారి పోతున్నాడు,
నిల్చోలేక పడుతున్నాడు.

ఎగసిన హృదయంలో సెగలు చల్లారకముందే ఏదో
ఎరతో ఎగదోస్తున్నారు ఎవ్వరో స్వార్థపరులు
ఎదగాల్సిన హృదయం దిగజారక మున్నే
ఎవరైనా సరే ముందుకు రండి, ఎలాగైనా రక్షించండి.

---

* లెక్చరర్. సర్దార్ పటేల్ కళాశాల: సికింద్రాబాదు.

## సుభాషిణి !

నెరయనూరి చంద్రశేఖరం *

చల్లని గాలిలో హృదయ మల్లన మెల్లగ తేలియాడగా
నల్లని యాకసంబు పయి నాట్య మొనర్చెడి మేఘమాలికా
వల్లరి యందు గ్రంకులిడు వారిజమిత్రుని సాంధ్య రాగమం
దుల్లము పల్లవింప గనుగొందును నీ నగుమోము ముంగిటన్.

ఇందు నిభాననా ! సుధల జల్లులు చిల్కెడు నీదు చూపులన్
చిందులు చిందు నాకలువచిత్తము; రాగము ప్రస్ఫుటించు నీ
యందము లీను లేనగవునందు సమర్పణజెంద డెందమా
నందరసాబ్ధి మునెగెడి; సమాశ్రిత వత్సల ! మత్సుభాషిణీ !

నిత్యము, నీదు నవ్యనవనీత మనోహర చిద్విలాస సాం
గత్యము గోరి నా కనులగోరెడి దుఃఖ కవోష్ణ బిందువుల్
ముత్యములై చెలంగ నొక ముద్దుల హారముజేసి నీదు ఔ
న్నత్యము జాటు పక్షముల నర్చన సేయుదునా సుభాషిణీ !

కాంచిన కన్నులెల్ల నవకాంతులు నాట్యములాడు నీరు భా
స్వంచిత దీప్తిపూత నయనాంచల రాగము జ్ఞప్తిసేయ ప్రే
మించెడి నిన్ను గూర్చి తపియించుటయే పరమార్థమంచు చిం
తించుచు కాలమీదుదును తీయని భావములన్ సుభాషిణీ.

నెవ్వగ దీర నీకృతిగనే నొనరించితి నెన్నొ భావపున్
గవ్వము నన్మదోమథన కల్పన; గ్రాహ్యము కానివారు నే
నొవ్వగ-'నర్థహీనము, మనోగతి' మన్మదమంచు దూరి రాల్
రువ్విన(_రోచు నీదుచిరునవ్వుల పువ్వులుగా సుభాషిణీ.

* ఎల్. ఐ. సి. జీవన్ ప్రకాశ్; హైదరాబాదు.

# ఆరాధన

రామనాథ కోటేశ్వరరావు *

ఈ ఆరాధన ఎందుకో ! ఈ ఆవేదన ఎందుకో !
కనుపించని దైవము, కనిపిస్తున్న దేవత కనుకరించనందులకే
వద్దనుకుంటాను ఈ ఆరాధన. వలదనుకుంటాను ఆ కనుగొనల సేవ.
కావాలనుకున్నా వద్దనుకున్నా ఆశతో చేస్తూనేవున్నా అయినా నా ఆరాధన
కఠిన శిలామయునిగా వరిస్తున్నాడతడు.
స్పందించి నాపై జాలి చూపటమేమిటని తలుస్తున్నదా దేవత.
సృష్టిలోని రహస్యమో, దైవత్వపు మహిమో
మానవత్వపు విలువయో, ప్రకృతిలోని ఆకర్షణో—లేక—
మనిషి చైతన్యమును కోల్పోకూడదన్న నిత్య సత్యానికి కట్టుబడిన
జీవ కణముల సంచేలనమో గాని
ఆరాధన జరుపబడుతూనే వుంది.
నమ్మికలేని ఈ ఆరాధన కూడదని భగవంతుడనుకున్నా
ప్రతిఫలా మాశించే ఈ ఆరాధన అనుచితమనీ, స్వార్థపూరితమనీ
ఆ దేవత తలపోసినా
నాలోని నాడులు స్తంభించవు.
నాలోని స్పందన ఆగదు జీవచైతన్యం నిలిచిపోదు.
ఈ ఆరాధన సాగుతూనే వుంటుంది
ఈ ఆలోచన ఆగకుండానే పోతుంది
శిలామయుడైన దేవుడు
మనసు దోచుకున్న దేవత
కరిగి—నన్ను వెంటగొనిపోక మానరు.
ఇది నా ఆశ,
ఈ ఆశ ఫలించేదాక లేదా ఎండి పండి రాలిపోయేదాక
ఈ ఆరాధన సాగుతూనే వుంటుంది.

---

* ఉద్యోగి, డివిజినల్ ఆఫీస్, ఎల్. ఐ. సి. ఆఫ్ ఇండియా; హైదరాబాదు.

## తమ్ముడూ !

సున్నా అచ్యుతరావు *

ఆశయాల కాంతిపథం అందుకోలేక
అక్రమాల రాతిబండలు దాటలేక
ఆదర్శాల ఆనందశిఖరం చేరలేక
సమస్యల సంకెళ్ళలో బందీవై పోయి
పరిస్థితుల పెనుతుఫానులో పరిభ్రమిస్తూ
ఆవేదనతో పరితపిస్తున్నావా తమ్ముడూ!
సమాజంలో నీతీ-న్యాయం నిర్భయంగా
నిలబడలేక వణుకుతూ దాక్కుంటున్నాయి.
జ్యోతిగా ప్రకాశించవలసిన మానవత్వం
కొడిగట్టి కొనవూపిరితో వెలగలేక వెలుగుతోంది!
అజ్ఞానం-అనాగరికత-దౌర్జన్యాలు
అవినీతి-అన్యాయం-దానవత్వాలు
చీకటిగొందుల్లో చోటుచాలక
ఎయిర్ కండిషన్డ్ భవనాలలో
మెర్క్యురీ లైట్ల కాంతులలో
కోరికల ఆకల్ని తీర్చుకుంటున్నాయి.
అందాన్ని పంచుకుంటూ ఆనందిస్తున్నాయి.
సభ్యతలనే ముసుగులో గుసగుసలాడుతూ
నాగరికతనే పరదాలలో గూడుపుఠాణీ చేస్తూ
నిన్నుచూచి నవ్వుకుంటూ గేలిచేస్తున్నాయి!
తమ్ముడూ !
ఈ సమాజం నిన్ను ఎపుడూ అర్థం చేసుకోలేదు
మనిషిలోని విలువల్ని మనిషి బ్రతికుండగా
గ్రహించక పోవడం ఈలోకం అలవాటు
ఇది ఎపుడూ జరిగే పొరపాటు !

* శ్రీకాకుళం.

## ఆత్మ నివేదన

అత్తోట వాసుదేవరావు, బి. ఏ. *

నా జీవితమొక చిన్నారి దీపవల్లి
పెనుగాలిని ఓర్వలేదు, అపూర్వశక్తి లేనెలేదు.
పెద్దవెలుగు చిమ్మరాదు, చిక్కని చీకటిని చీల్చలేదు;
కానీ-సంతోషపు తుషారానికది దగ్గర నేస్తం
అజ్ఞాన-కువిజ్ఞాన తిమిరానికది ప్రథమశస్త్రం.
నాజీవితమొక చిన్నపొన్నాగ పూబాల
మల్లెకువలె బహుజనాదరణలేదు-విద్వత్కవి పండితులకది
చాంపేయమువలె ప్రియముకాదు
ధరిత్రివలె బరువల్లా తలదాలుస్తుంది ఎవరికీ చెఱుపుతలచదు
నాజీవితమొక అల్పాసంపూర్తి గీతిక
భావబలమున్నా పదగుంభనకు దరనిది
అర్థబలం మిన్నయినా రచనరీతి నేర్వనిది
యుగయుగాంతాల నడుమ ఇమడని, మానవహృదయబాధ తెమడని
మాటలకిటికీ నల్లపూచలగుండా-హృదయపుగది తెల్లగోడల నిండా
పేరుకొన్న అశక్త దుఃఖనిషాన్నికక్కి బండబారిన మనిషి విచారవదనాన్ని.
నా జీవితమొక మారుమూల కొండ
సన్నగా ఎక్కడో జలపుట్టి మెల్లగా మరెక్కడికో సాగుతుంది.
చల్లగా ఎదురొచ్చిన సమస్యావరోధాలు దాటుతుంది
చివరికి జీవితాఖండస్రవంతిలో శాశ్వతంగా లీనమౌతుంది.
కన్నీటికి బదులు పన్నీటిని, అవమానానికి మారు ఆనందాన్ని
అధికారానికి బదులు ఆదరణనీ-ఆగ్రహానికి మారు అనురాగాన్ని
నిరాదరణకుబదులు సౌజన్యాన్ని-వీలైనంత ఈ నావసుంధరపై పెంచుతాను
వీలున్నంత ఈ మానవాళికి పంచుతుంది.

---

* స్టెనోగ్రాఫరు, ఎల్. ఐ. సి; హైదరాబాదు.

## జాబిల్లి

తూమాటి తాతారావు *

విజ్ఞానఖనీ ఓనరుడా! నీ విజయం ఘన విజయం
సాటిలేదు నీ దీక్షకు అవధుల్లేవు నీ ప్రజ్ఞకు
నిజమే! ఇప్పటి నీ దృష్టిలో నేనొక మట్టి ముద్దనే.
కాదనను కాని, నిన్నటివరకు నీతోడి మానవులే
ఏదో భ్రాంతితో నన్ను వర్ణించారు—పూజించారు.
మరి నేనో—
మీ పిల్లలచే గోరుముద్దలు తినిపించాను—వారి ఏడ్పులు మాన్పించాను.
కవిహృదయం నింపాను—కావ్యాల్లోనిండాను.
ప్రేయసిని వలపించాను—ప్రణయంలోనూ, విరహంకు తోడుగా నిలచాను.
సమస్యలతో వెతలనుచెందినపుడు వెన్నెలలు కురిపించాను.
ఓషధులను పెంచాను—నదులను ఊరించాను
జలధులను పొంగించాను ఎందుకు?
నా అనుంగుసోదరి—వసుంధర ఒడిలోని
మీ అందరి యోగక్షేమానికి—
కాని, ఇవన్నీ మరచావు నీవు—ప్రకృతికే ఎదురు తిరిగావు.
అంచెలంచెలుగా—రాకెట్ల నిచ్చెనలతోనన్ను చేరుకొన్నావు
సూదికంతంత అలుసిస్తే—మింటి నేదోచ యత్నిస్తున్నావు
గ్రహాంతరాశాల గుట్టు కనిపెట్టే ఓ మనిషీ!
ఇంటగెల్చి రచ్చ గెలవాలన్న ఊహే నీకు రాదేం?
ఒక్కసారి నీవుండే ఆ పృధివిని చూడు—
దారిద్ర్యపు కరాళ దంష్ట్రల నుండి దీనులను దరిచేర్చి—
వారి బ్రతుకుల్లో వసంతాలు నింపు
యుద్ధాన్ని నిర్మూలించి, శాశ్వత శాంతినిస్థాపించి
జీవితాలు ఆనందమయం చేయడానికి ప్రయత్నించిననాడు నేను నీవాణ్ణే.

* ఎల్. ఐ. సి. ఆఫ్ ఇండియా, జీవన్ ప్రకాశ్; హైదరాబాదు.

# అభిసారిక

టి. పి. ఆర్. హనుమంతరావు*

తన ప్రియసఖునిచే ఆతురత అధికమై
ఉద్వేగపూరిత హృదయమును రంజింపచేయ....
గమనవేగ జనిత స్వేద బిందుపుల
పవనుండు మెల్లగా వీచు పిల్లగాలులు మాయంబుజేయ....
పున్నమి సొగసుతో పూర్ణచంద్రుడు విరిసి
పడతి మార్గము కడు సునాయాసము జేయ....
రమ్మనుచు కోయిల కమ్మని స్వరాలు,
వనిత పదముల మువ్వల సవ్వడితో మేళవింపజేయ....
చాలదూరము నడిచి యలసి సొలసియుండ
నదియందు పూర్ణ జలములామె సేదదీర్చ....
వసంత ఋతురాజు తోటలో నిమిడి
మగువ మనస్తాపము తగ్గించి కడు దోహదముచేయ....
వరుణదేవుడు యామె విరహంబునెరిగి
సన్నసన్నని జలధార కురిపింప జేయ....
చాటు చాటున మబ్బుల దాగుకొనుచు
పశ్చిమ దిశన రేరాజు దినకరునితో సంభాషణలు సేయ....
సిత వస్త్రధారిణియౌ, యామె యందము
విరియుచున్న వెన్నెలతో యినుమడింపజేయ....
జడయందు మల్లెల, మేనియందత్తరుల
సువాసనలా ప్రశాంత నిశీధిలో గుబాళింపజేయ....
ప్రకృతి పురుషుడు ఇవ్విధముగ దోహదంబు జేయ....
ప్రియసఖుని పరిష్వంగ కేళీవిలాసముల తేలియాడ
వెడలెనొక 'యభిసారిక'.

---

* ఎల్. ఐ. సి. అసిస్టెంటు జీవనప్రకాశ్; హైదరాబాదు,

# సుస్వాగతం

మొంటూ రామలింగయ్య *

అనాదికాలములో నేనొక దేవతను
పాతరాతి జనులంతా పవిత్రముగ చూచువారు
కవికావ్యములో కాంతల ముఖబింబాన్ని
నాటినుండి నేటివరకు సాగించారు పరిశోధన
పరిశోధన పరాకాష్ట నందినది
సైంటిస్టుల ఆశలు పుష్పించి
ఫలభరితము లైనవి.
తత్ఫలితమే నరునిప్రవేశం నాలో.
దివిని భువిని కలిపివేయు బాటలెన్నో వేస్తారు
టూరిస్టుల కేంద్రాలు, దౌత్యప్రతినిధివర్గాలు
వెలుస్తాయి నాలోను.
ఏ కూటమిలో చేరక
నా గ్రహకూటమిలో నున్ననన్ను పట్టిలాగి పేర్లుపెట్టి
'శీటో' 'నాటో' కూటమిగా మారుస్తారు నన్నుకూడ.
శాంతి శాంతి ప్రవచనాలు శాంతిపేర మారణాయుధాలు
స్వేచా స్వేచ్ఛా నినాదాలు
స్వేచ్ఛపేర నరకాసుర యుద్ధాలు-భస్మాసుర హస్తాలు
ఇదియే మీ లక్ష్యమైతే వద్దయ్యా 'లియోనావ్'
వద్దయ్యా 'మాక్టోవిట్'-చాలును మీ సంపర్కం
చేరకు మాప్రాంగణాన చెరచకు మా గృహశాంతి.
పరస్పరమైన ఇచ్చికోలు, పరస్పరమైన అనురాగం
మనఅందరి నాదమైతే-మానవమేథా జ్యోతికి
స్వాగతం-సుస్వాగతం.

---

* స్టాఫ్ ఏజెంట్, ఎల్. ఐ. సి. ఆఫ్ ఇండియా; హైదరాబాదు.

# మీటింగులు

మొక్కపాటి శివాజీ *

మీటింగులు, మీటింగులు, పాతపాత బాటల్లో
కొత్తకొత్త ఆటంకులు, మీటింగులు, మీటింగులు!

అల్లానికి, బెల్లానికి
చిల్లర కార్యాల సర్వానికి....
మీటింగులు.

పెద్దల సంస్మరణార్థం సంతాప విరమణార్థం,
చచ్చినవాళ్ళకి శ్రాద్ధం, ఉన్నవాళ్ళ ఉపశమనార్థం
మీటింగులు....

వెండిలేక 'సోనార్ల' వి దండుదండు మీటింగులు

ఉన్నపన్ను పోవాలని, పన్నులివ్వక్కర్లేదని
పదవులు ప్రల్లదాలు, అదలింపులు, బెదరింపులు - మీటింగులు

విశ్వస్తుల స్వస్థతకోసం నిస్వార్థుల స్వార్థంకోసం
వచ్చిన పిచ్చేశ్వరునికి, తెచ్చిన పెచీకోసం,
మీటింగులు !

అవునని, కాదని, కాదన్నది అవునవునని
అయితే అదియెందుకు పొమ్మని ఇది 'అది' మాత్రం కాదని.
ఒకటే మీటింగులు!

మీటింగులు కో కొల్లలు కార్యాలకు పలు చిల్లులు
మీటింగుల కెల్లలు లేవోయ్ పనులేమైతేనేమోయ్.

రండిరండి, మీటింగులు, అధ్యక్షుల ఆశీస్సుకి
అచ్చయ్య ఉపన్యాసానికి, కార్యదర్శి ప్రలాపనకి
అందరికీ........చప్పట్లు!

---

* రీడరు, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

# మారుపేరుతో మళ్ళీ వచ్చింది

రేగోటి హరిశంకర్ *

కరువు కటకటలాడిపోతున్న తరుణాన
కరుణ మానవునిలో కరువైపోతున్న తరుణాన
మమతలు మాసిపోతున్న మానవులమధ్యకూ
"మంచి మనిషి"ని బ్రతుకనివ్వని మానవుల మధ్యకూ
మంచిమనసుకు మేకులుగ్రుచ్చి మట్టిలో పూడ్చే మానవుల మధ్యకూ
మనిషిని నమ్మి నశించిపోయే మానవుల మధ్యకూ
దశదిశలనుండి అన్యాయపు సెగలు, పొగలు మనిషిని వారించే తరుణాన
మళ్ళీ మరలొచ్చింది_శ్రీ ప్రమాదీచ నూతన సంవత్సరాది.

కష్టజీవుల కన్నీళ్ళు స్రవంతిలా స్రవిస్తున్నప్పుడూ
గుండెలు పగిలి ఎండిపోయిన పంటబీడులు చూసి
నిండుగ బ్రతికే దండైన కర్షక జీవితాలు_మోడైన తరుణాన_
నిగనిగలాడే మానవుల హృదయాలు భగభగ మండేటప్పుడూ
చక్కని జీవితాలుకొన్ని చిక్కని చీకట్లోపడి చితికిపోతున్నప్పుడూ
మళ్ళీ మారుపేరుతో మరలొచ్చింది ప్రమాదీచ వత్సరాది_
ఓ.....తీపి చేదుల నూతన సంవత్సరాది!
మనిషికి_మనిషిపై మమతలు కలనాడే నూతన వత్సరాది!!

శ్రమజీవుల కన్నీళ్ళు దూరమై_వారి హృదయాంతరాలలో సుధలు చిలికిననాడే
[illegible]"మన్నది ఉద్భవించిననాడే
[illegible] వేపపూలు వెలవెల పోయిననాడే
[illegible] వేళ్ళతో మామిళ్ళు కూలిపోనినాడే
సుందరమైన మానవుల హృదయమందిరాలలో
మృదుమధుర క్రొంగ్రొత్త కోరికలుద్భవించిననాడే యుగాది
ఆనాడే_జగానికి_జనానికి_ఉగాది_శుభ ది_
తీపి చేదుల మేలి కలయిక శ్రీ ప్రమాదీచ నూతన సంవత్సరాది.

---

* నవజ్యోతి కళాసమాఖ్య కోశాధికారి; హైదరాబాదు.

# ఇచ్ఛ

కల్యాణి *

నిష్కల్మష ప్రపంచానికి పోవాలని వుంది
ప్రకృతి మాత ఒడిలో పవ్వళించాలని వుంది
ఈ అశాంతిసాగరంలో కాన రాకున్నది ఆశాకిరణం
మసి పూసిన జగతిలో వినరాకున్నది మధురగానం
జీవితపుటెడారిలో ఈర్ష్యాద్వేషములేల ?
ఎండమావుల్ని చూసి వెండి వెన్నెలనే భ్రమయేల ?
ఎగిరిపోవాలని వుంది విహంగంలా ఏ దూరతీరాలకో,
తారల కాంతులతో కలిసి ఆడుతూ పాడాలని వుంది.
ఈ మరుభూమిలో నందన వనాలు మొలిచేదెప్పుడని ?
ఆ వనము నందు పూవునై పూచేదెప్పుడని?
పూచి పరిమళాలు కురిసే దెప్పుడని?
ఆ పరిమళాల లహరిలో పరవశించి
ఆదీ, అంతమూలేని ఆకాశంలో
తడబడే కాళ్ళతో నడుస్తూ తారుమారు చేసే కళ్ళతో చూస్తూ
"ఎచటికో ఈ నిరంతర పయనం" అని
ఆలపించాలని వుంది పలుకలేని ఈ మానసవీణపై.

---

* కుమారి ఆర్. మీనాక్షి, ఎల్. ఐ. సి. జీవన్ ప్రకాశ్; హైదరాబాదు.

# మిథ్యాజగత్తు

మిట్నం రామమూర్తి *

జీవితమంతా ఒక విషవలయము
కొందరికది అమృతము మరికొందరికది పాషాణం.
ఒకవైపు మధురస్మృతులు, ఇంకొకవైపు రుధిరస్రవంతులు
ఆత్మానందము పొందాలని కొందరు, భుక్తానందముకొరకు శ్రమించేవారు కొందరు
ఈ జగన్నాటకములో యెవరి పాత్రయెంతో యొకరికి తెల్పు
శ్రమజీవుల ఆక్రందనాలతో అలమటిస్తున్నా యీ ప్రపంచం
ధనికుల ఆనంద డోలికల్లో అట్టహాసాల్లో సంతృప్తి పొందుతుంది.
ప్రేమ నిర్భర ఝరీనిలయం కోసరము తపస్సు చేస్తున్నామని కొందరు
శోకతప్తులై సంసారాన్ని మోయలేక శోకించేవారు కొందరు.
ఆకలిదప్పుల ఆక్రందనాలలో కట్టిన
యీ భవంతులో నిలుప నీడలేక సతమతమవుతూ కొందరు,
ఆనందడోలికల్లో తులతూగుచూ నిలుచునేందుకు కళక్తిలేక శ్రమపడేది కొందరు.
ఆత్మాభిమానము చంపుకొని ఆయాసపడుతూ అవకాశవాదులు కొందరు
అవినీతులతో నిలువ నీడచేసుకొని అధికారముచేస్తూ నరజాతిని నాశనముచేస్తూ
జీవితపుటంచుల్లో గ్రమ్మి సతమతమవుతున్న జనుల వెచ్చనెత్తురు పీల్చుకుంటూ
సదవకాశాన్ని సహృదయముతో సంకలనము చేస్తున్నారు.
ఎక్కడుంది తృప్తి? ఎక్కడుంది సంతృప్తి?
బ్రతుకుతున్న మానవుడు తిండిలేక అలమటిస్తే బాధపడని మానవుడు.
బ్రతుకుబాటలు లేని బొమ్మలకు లక్షలు లక్షలు కుమ్మరిస్తున్నారు
మానవుని మానవత్వముపై నమ్మకము లేక మనిషియే మసి అయ్యాడు
ఈ జగన్నాటకములో యెవరిపాత్ర యెంతయో యెవరికి తెలుసు_

* కామర్సు లెక్చరర్, ఆర్ట్సు అండ్ సైన్సు కాలేజీ; ఆదోని.

## ఆత్మపరిచయము

విరవు బాలసుబ్రహ్మణ్యం *

ఉ॥ ఆయత వృత్తిబూని, హృదయమ్మెదబాయని శోకమేను పా
థేయముగా వహించి, విరతింగొన నేర్వని బాష్పవాహినుల్
పాయక తోడురాగ, కనుపట్టని లక్ష్యము గూర్చి నిస్పృహా
మేయ బలమ్ముతోడ కడిమిన్ కవితాథలిమునన్ చరించెదన్.

తే॥గీ॥ మందరోన్మథ్య మానాబ్ధి చందమొందు
శోకసంక్షుబ్ధ హృది జనిక్షోణిగాగ,
ప్రౌఢధీశక్తియూతగా బయలువెడలు
బ్రాహ్మి యేకైక హృదయ సంభావ్య నాకు.

ఉ॥ మంజరులంజలింగొని 'నమః ప్రభవే కరుణాలయాయ' అం
చుం జపియించు భక్తతతిజూచి, నిజేశునిగాంచి, 'పెండ్లి నా
డంజలి నెత్తిప్రాలిడుట' నాత్మదలంచు యశోధరన్, తదీ
యాంజన మిశ్రితాశ్రుల హృదంతరవీథి స్మరించుచుండెదన్.

ఉ॥ "అంతలుసింపి రాగమెదనంత నిరీక్షణ సేయుచున్న న
న్నింత నిరాదృతిన్ విడచి యే నవతారనో చేరనేగె నే
కాంతుడు చంద్రు"డంచు కటికంపుతమమ్మున మున్గు సంజ సా
యంతనవేళ నా హృదయ మార్ద్రము సేయుచునుండు టీనమై.

ఉ॥ భువన విమోహ కమ్ముల, ప్రమోదభరమ్ముల, నవ్యనిర్మలా
నవమద జృంభితమ్ముల, వసంతుని నవ్వుల పువ్వులం గనం
గ, వితత శోకసమ్మథిత కాలపయోధరమాల వేదనా
రవములు, నశ్రుధారల పరంపరలున్ మదినాకు దోచెడిన్.

తే॥గీ॥ పూలు మటివాడి వత్తలై రాలకున్న
ఫలము లేరీతి పుట్టుక బడయగలవు ?
కాన త్యాగమ్ము శాంతి నిదానమందు ;
బాధ యానందధామమ్ము ద్వారమందు.

---

* తెలుగు పండితులు, జిల్లా పరిషదున్నత పాఠశాల, మల్లాం; నెల్లూరు జిల్లా.

# నేను

సూర్యదేవ్ *

నీ చెక్కిలి సిగ్గులలో పూచే ఎఱ్ఱగులాబిని కాదు నేను
శ్రామికశక్తుల త్యాగంతో ఎఱ్ఱబడ్డ మందారాన్ని
క్రాంతిదర్శికవి కామనలో పాదుకొన్న పతాకాన్ని,
నీ హృదయ మందిరపు వలపు వేలుపును కాను నేను
అభ్యుదయపు వెలుగురేకల మేలుకొలుపును
సామాన్యుని భావన తిరిగిన మరోమలుపును
నీ నీలికురులలో కులికేటి మల్లికను కాను
గుబురుఇరుల నడుమ పొడిచేటి వేగుచుక్కను
అరుణరాగ పరాగ మలదుకొన్న వేకువ పువ్వును
నీ అధర సుధారసాన్ని గ్రోలే మధుపాన్ని కాను
ఘనఘన స్వామ్యపు విషపుగాడ్పుల బుసనణిచే నాగస్వరాన్ని
రాతిగుండె ధనం పండించిన వ్యథకు మేల్కొన్న ఆత్మస్థైర్యాన్ని.
నీ ప్రణయవనిలోన విరిసిన నవ పారిజాతాన్నికాను
విలయవేళ ప్రళయతాండవ మాడే రుద్రమూర్తి ఉగ్రత్వాన్ని
లేతగుండె జనం చెలిమిచూపుకని చేరుకొన్న చేతనత్వాన్ని
నీ చిరునగవుల తొణికే తుహిన బిందువునుకాను
కూలీ చిరుచెమటల చిందే సిందూరపు అంతస్సింధువును
నేను ప్రజాహృదంతరంగ కథనాన్ని-నవకవనాన్ని
నీ చెదిరిన కబరీబంధంకాదు నే చదివిన గ్రంథం.
చెరగని సమతావాదం నే నేర్చిన నవవేదం
నీ కులుకునడకలు-నాట్యగతులు కాదు నే చేసే గానం
వేదన, రోదన కలిసిన బ్రతుకుల స్వరజతులు నా నాదం
వాదన శోధన కలిపి నేమార్చే చరిత్రశృతులు నా ప్రాణం
నేను ప్రకృతి, సృష్టి, స్థితి, లయ, గతిని కవితాసారాన్ని.

---

* సూర్యదేవర జితిన్‌కుమార్, విద్యార్థి, గాంధి వైద్య కళాశాల; హైదరాబాదు,

# మధుర స్మృతి

గోపాలాచారి *

శృంగార రసపాన మత్తుండనే
ఝుంకార మధుపాన మత్తుండనే
కలిత నీలాల కురులాడెనే
కచపు భారాన విరులూడెనే.

నీ వాలు జడలోన సొగసున్నది
నా వైపు మరి తిరిగి చూడన్నది
నీ సొగసు ప్రతిరూపు నీ వేణిబంధంబు
నా కొరకె యన్నట్టు నిగనిగా మెరసింది.

ఏమనుచు తనలోన ఊహించెనో
పిరుదులే దాటుచూ పారాడి పోతోంది
పాయలుగ అల్లినా మెలికలతో తిరిగింది
నీవేణి బంధించె నామనసు ఉరకలను.

నల్లగా కనుపించి మెల్లగా కదిలింది
చల్లగా చూచి నాయుల్లమున దూరింది
వల్లమాలిన సిగ్గు ముంచుకొని వస్తోంది
పిల్లా! నీ జడ! నన్ను చిలిపిగా పిలిచింది.

తెల్లగా నీవుండ నల్లగా జడవుంది
మల్లియలు కురులలో దాగుండి నవ్వినవి
నినుచూడ నా కేమొ పిచ్చెత్తి పోతోంది
నినుమరచి దూరముగ నే పోవలెను.

---

* పి. భాష్యకారాచార్యులు, తెలుగు పండితులు, ఆలియా: హైదరాబాదు.

# పదండి ముందుకు

జి. సి. తిమ్మారెడ్డి*

పదండి ముందుకు పదండి ముందుకు ఆంధ్రమాతను ఆరాధింపగ
జై ఆంధ్రయని జే కొట్టుచును అధ్యాపకులు.... విద్యార్థులును
యన్.జీ.ఓలు ఇంజనీర్లు డాక్టర్లు మరి
యువతీ యువకులు భావిని దలచి ఆంధ్రతనూజులు, ఆంధ్రమాతను
అనన్యభక్తితో ఆరాధింపగ, పదపదపదయని పదండిముందుకు
నవీనయుగమిది, నవయువ్వనులా, యువతీయువకులు ప్రవాహముఖమై
సవాలుజేయుచు భవిష్యత్తుకై, వీరనాయకులు దారినిజూపగ
ధరస్వాంతులై పేరునిల్ప జయభేరి మ్రోతతో, భూరినినదముల
జై ఆంధ్రాయని జైకొట్టుచును, పదపదపదయని పదండి ముందుకు
రేపను మాటకు రూపులేదనీ, ఎపుడనుకొను పనినపుడే జేసి
ఆలస్యం అమృతం విషమని యన్నమాట హృదయాన లిఖించి
ప్రజారాజ్యమున ప్రజాభిమతమే, ప్రధానాచరణ విధానధర్మం
బను సూత్రంబును మననము జేస్తూ, పదపదపదయని పదండిముందుకు
స్వదేశదీక్షా స్వతంత్రరక్షా, స్వజనోద్ధరణా స్వదేశసేవా
వ్రతంబుపూని గతంబుమరచి, యువతీయువకులు యురవడితో నిక
పదుగురతోటి పదండిముందుకు, పదపదపదయని పదండిముందుకు.

* ఏలేజి మేజిస్ట్రేట్, ధోనిముక్కల; గుంతకల్లు.

# నేనొక తపస్విని

డి. రాధాకృష్ణరావు *

నేనొక వైజ్ఞానిక తపస్విని
విజ్ఞానపుటంచులు వెదకుటె నా జీవితలక్ష్యం।
ప్రయోజనాల ప్రమేయం లేదునాకు
సత్యాన్వేషణమే_నా ధ్యేయం।
ప్రయోగశాలయె నా పర్ణశాల
ప్రయోగ శాలయె నా సాధనం
పరిశోధనమె పరమయోగం
అనుమానం అసలే పడదు
ప్రత్యక్షంగా పరికిస్తేనే నమ్మేది దేనినైనా।
నా మెదడులోని పొరల విస్తీర్ణం విస్తారం
నేనార్జించిన విజ్ఞాన సారం అపారం
నా మేధస్సున ఇముడని వింతలు
నా విజ్ఞానానికందని విశ్వరహస్యం లేనే లేదు।
అంతరాలు అధిగమించాను
కాలానికి కళ్లెం వేసే శక్తి
కనుచూపు మేరలోనే ఉంది
సృష్టికి ప్రతిసృష్టి
అసాధ్యం కాదిపుడు.
విశ్వాంతరాళంలో విచ్చలవిడిగా
విహరించగలను నేను
స్వర్గానికి రాకపోకలు ఊహాగానాలు కావిపుడు
నే తలుచుకుంటే మార్చివేయగలను మానవలోకాన్ని
స్వర్గధామంగానో శ్మశానవాటికగానో।

---

* సహసంపాదకులు, ప్రచురణశాఖ; గవర్నమెంటు ఆఫ్ ఇండియా.

## రాగలహరి

ఎమ్. కృష్ణమూర్తిరావు *

తే॥ గీ॥ లలితసుకుమారి వెన్నెల లలన యామె
చిలిపిచేష్టల నొక్కింత చేరి నిలిచి
మధుర మంజుల గానముల్ మరులుగొల్ప
ఆడిపాడుచు నలరారె నా లతాంగి.

ఉ॥ ఎంతటి సౌకుమార్యత, అవెంతటి చారు విశాల నేత్రముల్
ఎంతటి కోమలంపు మనసెంతటి తీయని కీరభాషణల్
ఎంతటి అందమైన కురులెంతటి లేదరహాస చంద్రికల్
ఇంతటి రూపురేఖలలరించెను నాదు మనంబు నెచ్చెలీ.

సీ॥ జడకట్టు ముంగురుల్ సవరింపగా నెంచి
దరిచేరినంత నా తరుణికొంత
చిలిపి చల్లనిచూపు చెలగి మెల్లనఁజూచి
కైపున కెక్కించె కలువ కనుల
కనుల కాంతులఁజూడ కదలి ముందుకుచేర
చిక్కని చెక్కిళ్ళ నిక్కనిలిపె
నిలిపిన చెక్కిళ్ళ నెంమి ముద్దులునిల్ప
నంత లేనగవుల నదరెపెదవి.
పెదవిపై ప్రేమముద్రలు పొదగఁబోవు
నంతలోనసె నూత్నారుణాధరములు
ఓరచూపులు చూపించె నొరచెలియ
నేర్పు మీరెనుఁగో యిక నేర్పనేల

* టెలిఫోను ఎక్స్ఛేంజ్, గౌలిగూడ; హైదరాబాదు.

# దీవెన

జి. వెంకటేశ్వరరావు *

సీ॥ భర్తను సుఖపెట్టు భార్యకదాయెల్ల
వేళల నుతినందు ప్రేమమీర
పతిసేవలొనరించి, సుతిగాంచె సావిత్రి
యమర సౌఖ్యంబుల నందెకాదె
జపతపంబులకంటె సద్భక్తి పతిసేవ.
సకలసంపదలు ప్రశాంతినొసగు
పతిసేవమించిన ఫలితంబు లేదంచు,
సతులైన వారలు చాటలేదె.

అన్నివిషయాలు మదిలోన నరసినీవు
పుట్టినింటికి మరియు నీ మెట్టినింటి
గౌరవంబును నిలబెట్టి ఘనతమీరి
పుత్రపుత్రికాసంతతి బొందుమమ్మ.

సీ॥ ఆనందమనెడి యూయల నూపి హాయిని
చేర్చునది భార్య, శీలవతియ
సంసార సాగర సంతరణార్థమై
సాయపడు పడంతి సాధ్వికాదె
తనయులగనిపెంచి, తనకీర్తి చాటించి
పుణ్యలోకావార్తి పొసగజేయు
హితుని కన్నను మించుహితవు బోధించుచు
కంటికి రెప్పగా గాంచు నదియ.

అట్టిసతినిబడసి నాడవయ్య! ఇపుడు
భోగభాగ్యాల తోడ ప్రపూర్ణులగుచు,
వాంఛితార్థంబు లందుచు వసుధపైన
వర్థిలుచు నుంద్రుగాత వేవత్సరాలు.

* ఇ. సి. ఐ. ఎల్.; హైదరాబాదు.

## నాకు స్వాతంత్ర్యం వచ్చింది

కాంచనపల్లి చినవెంకటరామారావు *

నాకు స్వాతంత్ర్యం వచ్చింది, నడిబజార్లో నడవడానికి.
ఆరు నూరును చేయడానికి, నూరారును చేయడానికి.
తిమ్మిని బమ్మిని చేయడానికీ, బమ్మిని తిమ్మిని చేయడానికీ.
నీతిని నడి బజార్లో నిలబెట్టడానికి నాకు స్వాతంత్ర్యం వచ్చింది
లెఫ్టు సైడు నడవాలని, తెల్లవాడు, రూలాఫ్ ది రోడ్ చేసినా
పచ్చి రైటిస్టుగానే ప్రవర్తించాడు.
మొన్న బెజవాడలో మావాళ్ళంతా అందరినీ కుడికే నడవమన్నారు.
యెడమదిక్కు పోనే పోకూడదన్నారు అయినా,
భారతాన్ని లెఫ్టులో నడిపిస్తానంటున్నాడు, దేశాన్ని రైట్ గా పోనే పోనివ్వనంటున్నాడు
నల్లనివాణ్ణే అయినా పద్మనయనంబుల వాణ్ణికాను
పాండవ పక్షపాతినీ కాను.
పంచాయితీరాజ్య స్థాపనాచార్యుణ్ణి, పంచుకుతినే వ్యవస్థా పోషకుణ్ణి–
పై సభలోనూ కింది సభలోనూ, చివరికి, పంచాయితీ భవనాల్లోనూ
పెరుగుతున్న జనాభా ఫ్యామిలీ ప్లానింగు లేక, పట్టనే పట్టడం లేదు.
అందుకే జిల్లాకో రాష్ట్రమయిందాకా, రాజకీయునికుద్యోగ నివారణ అయిందాకా
నాస్వేచ్ఛ స్వాతంత్ర్యానికి యేమిటీ అంటున్నాను–
యెద్దులు సమైక్యంగా వుండి పులినెదిరించడం
యేనాటిదో పాతపురాణం కథ ఆ కథ కంచికిపోలేదు మనమింటికి చేరలేదు
అనకనే వాటన్నిటినీ తిరగరాయించ బోతున్నాను.
ఐక్యతకు అసలైన అర్థం విచ్ఛిన్నతయనీ, సమగ్రతకు కుక్కలు చింపిన విస్తరియనీ
నీతికి అచ్చమైన అర్థం అవినీతియనీ
ఉద్యోగం అంటేనే కేవలం జీతంరాళ్ళకు మాత్రమే చేసే పనికాదనీ,
ఇలా యిలా యెన్నో యెన్నో వినూత్నార్థాలతో
డిక్షనరీనే తిరగబెట్టి రాయిస్తున్నాను.

---

* అడ్వకేటు, రామగిరి; నల్గొండ జిల్లా.

# మన ఇంటికి స్వాగతం

నముడూరి శ్రీనివాసు *
గూడూరి రామనాథశాస్త్రి *

చనుదెమ్ము సోదరా మన గృహమ్మునకు
హృదయమ్ము పారవశ్యాన నాట్యమొనర్ప.
సరసహృదయమ్ము మన ఇంటికి మార్గమయ్యె
రమ్ము రమ్మిదే సువాసనల విరజిమ్ము మన విరులతోట
ఎల్లలూ హద్దులూ కనరానిదా చోటు
అటు చూడుమొకసారి ఎఱని గులాబీలు
వీని రాగవర్ణం సహృదయ రాగానికి చిహ్నంకదూ।
ఈ మల్లియల తెల్లదనం నైర్మల్యానికి ప్రతీక
సంపెంగల సన్నజాజుల పరిమళంముందు
స్వర్గం చప్పగా ఉండదూ ?
ఈ బంతుల చేమంతుల ముగ్ధసౌందర్యానికి దీటేది ?
ఈ తామరలూ, కలువలూ దివారాత్రులకు
నాందీ భరతవాక్యాలు.
పారిజాత సౌరభం ప్రపంచాన్ని మనోహరం చేస్తుంది
ఈ విరి కన్నియల సౌందర్యం తిలకించు,
గుబాళించు సువాసనల నాస్వాదించు,
ఈ పువ్వుల వాడనీక. ముళ్ళకు తగలనీక, గాలికి చెదరనీక,
దౌష్ట్యానికి నలగనీక, ఈ చెట్లను నశించనీక
నీరుపోసి రక్షించాలి మనమే సోదరా।
మరి మన జీవితమనే ఎడారికి ఒయాసిస్సీపూలతోట
ఇదే మన గృహమూ, వనమూ, జీవనమూ.
ఈ తరులు కవులూ, ఈ విరులు కవితలూ
మన గృహము సాహితీ మందిరమ్ము,
మన వనము సరస వాఙ్మయపురము.

---

* విద్యార్థులు; సికింద్రాబాదు.

## ఆడ బ్రతుకు

ఎల్. ఎస్. ఎస్. ఆర్. ఎ. శర్మ *

తలిదండ్రులకు బరువు
రోమియోలకు మెరుపు
తన బ్రతుకే తనకు వెలుపు
తెలసి మసలుకొన్న గెలుపు.

స్వతంత్రతకు గొలుసు
సంఘానికి అలుసు
తోబుట్టువులకు అలుసు.
తనమనసుకే తెలుసు

కన్నీటితోనె కాలమంత గడచిపోవుననే చింత
మనసుండీ తెలుపలేక మారిపోవు కడకు శిలగ
ఆడపిల్ల బ్రతుకు—అది
నాటికీ, నేటికీ మారని, తరగని కన్నీటి కడలిపొంగు.

## నూత్న వత్సరమ్మా !

సూర్యదీప్తి, సకల సుమదళంబుల జేరి
వేడుకలర ముద్దులాడు వేళ
అంజలించు మానవాత్మలలో జేరి
వరశుభమ్ములిమ్ము ! వత్సరమ్మ !

రణ నినాదములకు, శాత్రవరూపములకు
తగవులకును, జగతి స్థానమయ్యె.
సర్వమానవులకు, సఖ్యత సమగూర్చి
వరశుభమ్ములిమ్ము ! వత్సరమ్మ !

ద్వేషవహ్ని నార్పి, పోషించు నీ మంచిని
పెంచు దెందమందు ప్రేమలతలు.
నవ్య వత్సరమున నవ్యరాగాలతో
వరశుభమ్ములిమ్ము ! వత్సరమ్మ !

---

* ఎల్. ఐ. సి.; హైదరాబాదు.

# స్పందన

గుంటి పుండరీకాక్షయ్య *

జీవితం అందాల రసరాజ్యమని
ఆనందం-ఆహ్లాదం-అనుభూతులు
కలగా పులగంచేసి, విధాత సృజించాడని
ఊహల చాంపేయమాలలల్లాను, రమ్య హర్మ్యాలు వినిర్మించాను.
ప్రతి అక్షరం రమణీయంగా ఏర్చికూర్చి
నా ఊహాద్వారానికి రమ్యభావాల తోరణాలుకట్టి
కావ్యాలు కూర్చాను-గేయాలు రాశాను, కథలు చెప్పాను.
కలతపడిన మనసుల మోతలు, రక్తంలా చిమ్ముతున్న స్వాతంత్ర్యం
పేదవాని కూలుతున్న కలలమేడ, చితి మంటలా కాలుతున్న భాగ్యనగరి
సమస్యల బ్రహ్మజెముడు డొంకలు
కలలోని అస్థిపంజరంలా భయపెడుతుంది ఈ జీవితం
చైతన్యస్ఫూర్తి లేని జడపదార్థంలా ఒదిగి ఒదిగి వుండలేను
గతానికి దాసోహమనలేను. ఈ చీకటి నిశిలో మ్రగ్గలేను
ఆశయాల ప్రేయసిని ఆరాధిస్తాను నిజం-ఇంట్లో వసిస్తాను
మానవత నా ఊపిరి, అనాథుడు నా దేవుడు
నా గుండెలో జరుగుతోంది స్పందన।
సామాన్యుడి గుండె గుడిలో ఆరిపోయిన జీవకాంతుల్ని
వెలిగిస్తుంది నాకలం
మానవళి నిండు గుండెలలో సమత, మమత, సుహృద్భావం నింపుతా।
సామ్యవాద సమాజం నెలకొల్పుతా।
విశ్వమానవ హృదయ విపంచి మీటి మధుర తంత్రీ నాదాలు పలికిస్తా
ప్రతి యింటా ఆనంద తోరణాలు వెలయిస్తా
అందుకే నా కలం, నింపుకున్నది మషీపంకిలం కాదు
నిరుపేదల నిండు గుండెల నెత్తురు।

---

* వ్యాపారస్థులు; శ్రీకాకుళం.

# నా దేశం

అశ్వని *

కనులకు పండుగ
వీనుల విందుగ
భరతము సృష్టించిన
పరమాత్మ జోతలు
హిమగిరి శృంగమ్ములలో
అమరిన తాపసులూ
ఆశ్రమ వాసుల
అతిధి పూజలు
అతిమోద_ఆత్మానందం
గంగాయమునా బ్రహ్మపుత్ర సింధూ
తుంగభద్ర గోదావరి కృష్ణా
కావేరి పెన్న మూసా
ఆవేశముగా
పారుచునుండెనుగా
పరమానందముగా....
పడమటి తూర్పు కనుమల్లోనా
ప్రతిగ వింధ్యాద్రి
మధ్యనున్నదే ముద్దు త్రిలింగం
గద్దెలెక్కి రాజులు బుద్ధిగ పాలించిరి
"దేశభాషలందు తెలుగులెస్స" ని
విశ్వమున చాటెను శ్రీకృష్ణరాయలు
విశ్వాసంతో తెలుంగు ప్రజలూ
ఆస్వాదించిరి సాహిత్యామృతం

---

* కె. లింగమూర్తి, ఆంధ్రజనత విలేఖరి: మర్రికల్లు,

# నిన్న - నేడు

అగ్ని *

గతమంతా చీకటియను, వర్తమానమే వెలుగను
పలుకులు ఈనాడంతా, పరిపాటిగ మారినవి.
గతం గౌరవము పొందిన, కల్గు నేటికేల హాని
తండ్రికి వందనమిడిన, తనయున కది తలవంపా ?
క్రొత్తకావాలనియెడు, కోరిక నిన్నటిదే సుమి
మేథస్సుకు తిరుగుబాటు మీద మక్కువ ఎక్కువ
తెలుగుతోడ నన్నయ్య, తిరుగబడెను పాతమీద
నాటి జీవనాడిని చూపెట్టెను తిక్కన కవితలు
పాల్కురికి పండితుండు ప్రతిభామణి శ్రీనాథుడు
పెద్దన గురుజాడాదులు పెంచినారు కొత్తదనం
కాని వారు పూర్వకృషికి కై మోడ్పులు చేసినారు
క్రొత్తపాతలను కలిపి, క్రొమ్మెరుంగు దిద్దినారు
ఆనాటికి అది క్రొత్త, నేడు కొందరికి చెత్త
ఊహించే శక్తియున్న ఉంది అన్నిటిలో సత్తా
చరిత్ర తిప్పి వ్రాయాలని ఛాందసమ్ము చూపాలని
కాలచక్రమును వెనుకకు కదలించాలనికాదు.
నేడు జరుగు రూపకమునకు నిన్నటి గీతమేనాంది
కనబడు ప్రతి సౌధానికి గతమె దానికి పునాది
అనుభవాలు నేటివైన అక్కరలు నిన్నటివే
అనుభూతులు నేటివైన
ఆశయాలు నిన్నటివే
నిన్నటి ఆహారమంత నేటికి చైతన్యంగా
మారి రేపు నిర్మించగ, మహీస్థలికి ఉపకరించు
అందుకే చెబుతున్నాను మనకెందు ప్రయోజనమున్నదొ
సందేహము మాని త్వరగ
అందుకొనుచు సాగాలని.

---

* లెక్చరర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల; జనగామ.

# మేలుకో

ఎన్. రామస్వామి *

ఓరోరి తెలుగోడా మేలుకోరా !
ఎందుకురయ్యో నీకీ విపరీతబుద్ధి
ఏమిటిరయ్యో నీకీ చీలికరద్ది
ఎంత నాశనమును కోరి విడిపోయె మనసు.
ఎందు పొందలేవురా నీవీపాటి సుఖము
తెలుసుకో, తెలుసుకో నిజానిజాలు
భవిష్యత్తంత ఒక్కసారి బాగుగ యోచించు
మసక చీకటిలో మనసు మార్చుకోకు
మంచితనముతో ముందుచూపుతో
అందరిబాగును కోరి ఆదర్శంగా నిలువు
అందరు కోరేమాట రత్నరాసుల మూట
మోయువానికె తెలుసు పరివారభారం
మేలుకో_ మేలుకొని ఒక తాటిపై నిలువు
ప్రజాక్షేమము కోరి పరీక్షించుకో మనసును
పరిపరి విధముల నీవు పరితపించబోకు
విడిపోయామంటె ముక్కలు చింపిన విస్తరాకు
తెలుసుకో_తెలుసుకో వెలుగు లీనెడుబాట
పాడుకో పాడుకో_ తెలుగు గుండెలపాట.

---

* విద్యార్థి, గబ్బెట; వరంగల్ జిల్లా.

# పాప నవ్వు

ఎల్. కన్నయ్యనాయుడు, ఎమ్. ఎస్సీ. *

ఎందుకు పాపా నవ్వు ? ఏంకావాలి ? ఎవరిమీద కోపం ?
ఎవరు చెప్పగలరులే నవ్వుకు అసలు కారణం
ఆయాలు డాక్టర్లు అందరూనవ్వు ; పెద్ద డాక్టరు తప్ప
అంతా నవ్వు దశదిశలు దిగంబ్యధన మెల్లగ వీచే గాలితప్ప
నవ్వు తనదే సాధించలేము ఏ చిన్న కోరిక కూడా అని
నవ్వు లేని మమ్ముల మరిమరి ఏడిపించకు పాపా!
నవ్వు పరిష్కరిస్తుంది సమస్యలు సృష్టిస్తుంది సమస్యలు
ప్రసవ వేదనతో విలపించే మాతృమూర్తి పచ్చి బూతులు తిట్టే డాక్టరు
చచ్చిపోయిందనుకున్న "సీజరు బేబి" నల్లకుక్క నోట్లో ఆర్తనాదం!
కడుపుతీపిని చంపుకొని పసిగుడ్డును పరహస్తం చేస్తున్న అభాగ్య జీవి
భయంకరం భయం భయం! ఈ లోకం పాపా, భయపడుతున్నావా ?
భయమేల మమతల ఊయల వాత్సల్య బృందావని అమ్మ ఉండగా ?
పని చేసేచేయి ముడుచుకొంటె కునికిపాట్లు పడేది భవిష్యత్తు—
ఉషాబాల కళ్ళుమూసుకుంటె ఉసూరుమని చీకటి నిండిపోదా
గుడ్డునుండి పిల్ల గింజనుండి మొలక బయటకు రాక ఆగిపోతే
గిరగిర తిరిగే కాలచక్రం ఆగి జగతి తలక్రిందులయిపోదా!
పెద్దడాక్టరు లెక్క నీవు పుట్టవలసింది అక్టోబరు పదునాలుగున
పిల్లల పండుగ ఈ రోజు మా కనులపండుగ చేయరావా ?
ఎంతో మంచి ఎర్రగులాబి కథ ఉంది చెప్తాను రావాలి మరి,
అమ్మ కొండంత ఆశతో ఎదురుచూచి విసిగి పోయింది
అమ్మ తల్లడిల్లిన వేళ పాపా! పిల్ల మాటేమిటి ?
పంతం పట్టి తలక్రిందుల తపస్సు చేయక ప్రసన్నవై
పేరాశలతో అలసిపోయిన మాకు ప్రశాంతిని ప్రసాదించు
ప్రభాత వెలుగును పంచిపెట్టమ్మా ప్రగతి బాల.

---

* అర్థగణాంకోపన్యాసకులు, శ్రీ వెంకటేశ్వరా యూనివర్సిటీ; తిరుపతి.

# పాతికేళ్ళ స్వాతంత్ర్యం

తాళ్ళపల్లి మురళీధరగౌడు *

పాతికేళ్ళ స్వాతంత్ర్యం
పండించిన పర్వాలెన్నో
పేదవాని గుండెల్లో
ప్రభవించిన జ్వాలికలెన్నో ॥
ఏమిమేలు జరిగెను ? మా ఎదలో చిచ్చులు రగిలెను.
కొద్దిమంది చేతుల్లో ఒదిగిపోయె స్వాతంత్ర్యం
ఆశలు చిరు ఉరిత్రాళ్ళకు ఆత్మాహుతులై రెందరో ।
ఆశయాలు నెరవేరక హృదయములారేసినారు.
దూదికన్న తేలికైన
బీద ప్రజానీకమునకు
కన్నీళ్ళే కరువైతే
వెన్నెల లింకెందులకో ।
ఎక్కడ చూడను నవ్వులు
ఎగసెడి నిట్టూర్పులలో
ఎక్కడ పాడను గీతం
ఎదలు మండు సమయంలో.
మల్లియలే విరియుచోట
నల్లని సర్పాల బుసలు ;
సామాన్యుని బ్రతుకులాగ
చతికిలబడు జీవమ్ములు—
పాతికేళ్ళ స్వేచ్ఛా శత
పత్రం సౌరభమ్ములను
గుబాళించు నమ్మకమ్ము
గుండెల నిండేనా ?

---

* బి. కామ్. విద్యార్థి, సర్దార్ పటేల్ కాలేజ్; సికిందరాబాదు.

# కవిత

శేరిపల్లి హనుమంతరావు*

ఇది కవిత ? ఏది కాదు కవిత ?
కవితకు కావాలి ఆధారం
దుర్భర ఆవేశపూరితహృదయం
ఒకడు మత్తుకి దాసుడై
వేరొకడు లోభానికి దాసుడై
రాసేది కవితకాదు చెప్పేది వినతికాదు.
కలిమికి దాసుడై ఒకడు
కాంతకు దాసుడై వేరొకడు
చెప్పేదే కవితైతే
చేసేదే వేరైతే
కవికాలేడు_మానవుడు
రవి కానని చోటు కవి కాంచగలడని ఎంచి
అందని ఆశయంతో నింగికి నిగిడే నైరాశ్యంతో
కృంగి కృశించి రాలిపోయేకన్న తను నమ్మిన ఆశయాన్ని
ప్రజలుపొందే ప్రగతిమార్గం చూపాలి
వెన్నుతట్టి లేపాలి.
సంఘంలో జరుగుతున్నట్టి చేదునిజం బయటపెట్టి
ప్రజలముందు ఉంచేకన్న చెడును దిద్దే ఉపాయం
తోటి సోదరులకు తెలపాలి
కవియే రవి కావాలి, శుభోదయం రావాలి.
సర్వమానవ సౌభ్రాతృత్వం
సహజీవన సమభావం
పెంపొందిస్తేనే కవిత్వం
మిగిలేదంతా కపిత్వం.

* ఉద్యోగి, ఎల్. ఐ. సి జీవనప్రకాశ్; హైదరాబాదు.

## 'విష్ యూ ఆల్ ఏ హేప్పీ న్యూ ఇయర్'

శ్రీపతి రఘురామ్‌కుమార్ *

రెండు శతాబ్దాల దాస్యం ఫలమిది.
అందుకే యీ సంప్రదాయం-అంత సులభంగా వదులుకోలేం!
తెల్లారిలేస్తే కాఫీ, సిగరెట్, టెలిఫోన్, సినిమా
అన్నీ తెల్లవాడిచ్చిన అపురూప వరాలే
అందుకే గుడ్‌మార్నింగ్, గుడ్‌నైట్, సారీలను
రోజుకోసారైనా అనకుండా ఉండలేం
గ్రహాలగమనాలు మూలం, మనఋతువుల ఆగమన నిరమనాలకు
ఆమనీ-వికసించినవనీ జీవితపు విలువల్ని తెలిపే వేపపూపచ్చడీ
తెలుగు ఉగాదికి సంకేతం.
ఉగాది, మనకూ కన్నడులకూ, మహారాష్ట్రులకూ ఉగాది.
పడమటివారికి జనవరి ఒకటి నూతన వత్సరారంభం
పాతికేళ్ళ స్వాతంత్ర్యానంతరం ఆంగ్ల చిహ్నాలను విశేషంగా తొలగించాలని
తీవ్రకృషి జరుగుతున్న తరుణంలోనూ
ఈ సంప్రదాయాన్ని విడలేకున్నామంటే కారణం?
ఆలోచించండి మీరూ మరోపర్యాయం.
కేవల పాశ్చాత్యవ్యామోహమే కాదు, నరనరాల్లో జీర్ణించిన అలవాటిది.
కార్డు, రైలు, పోస్టాఫీసు, సిగ్నల్
వీటి తెలుగు తర్జుమా పల్లెటూరి బైతుకూ అర్థంకాదు.
వ్యవహారంలో అంతగా పాతుకుపోయే యీపదాలు.
వ్యామోహంకంటే చెడుపుచేస్తుంది తగని విద్వేషం
స్వభాషా, జాతి, మతాభిమానం సర్వదా వాంఛనీయమేకాని,
వెర్రితలలు వేయకూడదు.
అనిష్టంలో అమృతాన్నికూడా త్రాగించలేం
ఇష్టంలో విషాన్నైనా మ్రింగించవచ్చు.
మొహంజోదారో నాగరికత పేరిట మురిసిపోవటం కాదు
'ఏదేశమేగినా, ఎందుకాలిడినా పుడమి భారతిని పొగిడితే' చాలదు
ఆ పూర్వపు టౌన్నత్యాలను అందుకోగలిగే స్థాయికి ఎదగాలి.
సంప్రదాయాలను మరిపించే-నూతన సత్సంప్రదాయాలను నెలకొల్పే
చైతన్యపు వెల్లువ(రా)వాలి.

* ఎల్. ఐ. సి; జీవనప్రకాశ్ హైదరాబాదు.

## "మనదేశం బాగుపడే దెప్పుడు ?"

వి. సుబ్బరాయశాస్త్రి *

ఫలించని ప్రజాస్వామ్యం వాక్శుద్ధిలేని వాక్స్వాతంత్ర్యము
మానవత్వము నశిస్తున్న ఈ నవసమాజములో సమానత్వము
పొట్టకూటికై పనికిరాని కాగితపు పట్టాలు (పేపర్ డిగ్రీలు)
కుక్కగొడుగులవలె మొలిచి చెట్టుక్రింద ప్లీడర్లలా వెలసి
సోషలిజమ్ అంటూ_సెక్యులరిజమ్ అంటూ
ఉపన్యాసాలు దంచేటి నాయకులు_వినాయకులు
ప్రజల గోడువినని ప్రభుత్వము
పాలసీలు లేని పార్టీలు_పదవులకై పార్టీలు మార్చేటి రాజకీయ వేత్తలు
అక్కరలేదు_మాకక్కరలేదు.
తాతల_తండ్రుల పేర్లు చెప్పి కాలం వెళ్ళబీద్దామనుకునే దేశభక్తులు
దేశమంతా అల్లకల్లోలమై యుండగా కార్లలో విలాసయాత్రలు జరుపుతూ
నినాదాలను చల్లివేస్తూ జీవితం వెళ్ళబుచ్చేటి దేశపాలకులు
పెద్ద పెద్ద చదువులు చదివి పరిపాలనా యంత్రాంగములో అధికారులై
బల్లక్రింద చేతులు చాపేటి లంచగొండి_అవినీతి పరులు
అక్కరలేదు_మాకక్కరలేదు.
అయితే ఈ దేశం బాగుపడేదెప్పుడంటారా_వినండి!
ముప్పూట్ల గంజి - ప్రాణం నిలబెట్టుకునేందుకు
మూడుమూరలబట్ట_మాన సంరక్షణార్థమై
మూడు గజాలనీడ_తలదాచుకునేందుకు సమకూరినప్పుడు
చేయగలిగిన ప్రతివాడిచేతికి పని కల్గినప్పుడు
ప్రణాళికలను అమలు పరుచుటకు కంకణం కట్టుకొన్నప్పుడు
సామరస్య సహజీవనానికి అలవాటు పడి
దేశమంటే, భక్తి_క్రమశిక్షణ_ నిజాయితీ
కల్గియున్న ప్రజలున్నప్పుడే_మన దేశం బాగుపడేది.

---

* స్టెనోగ్రాఫర్, బి. హెచ్. ఇ. ఎల్: హైదరాబాదు.

# భాగ్యనగర లేఖ

కె. వి. రామప్రసాద్ *

అర్ధ శతాబ్దంగా ఎరుగని విచిత్రదశ
అనుభవిస్తోంది భాగ్యనగరం
పంచాగం ఋతువులు ఆరు - ఇక్కడ రెండే
శిశిరం ఒకటైతే గ్రీష్మం రెండోది.
జీవనవనాలలో ఆశల ఆశయాల ఆకులు రాలిపోతున్నాయి
ఉద్యానవనాలలో కోరికల కోరకాలు వికసించే జాడేలేదు.
సంధ్యలో వెలిగినదీపాలు చీకట్లో కళ్ళుమూస్తాయి
ప్రమిదను వెలిగించాలంటే చమురుకోసం క్యూలోనే సమయం సరి.
అందుకని చీకటినే ప్రేమించటం అలవరచుకుంటున్నాం
కాలంతో, రాజీపడుతున్నాం-ఇది మా నిత్య శిశిర స్వభావ రూపం.
మా ఆకాశంలో మేఘాలు వర్షించటం మరిచిపోయాయి
కనీసం చల్లని నీడైనా ఇవ్వక వేడిగాల్పులు వీస్తున్నాడు అనిలుడు
మార్తాండుని ప్రభావానికి నీరాజనా లర్పిస్తూ
నానాటికీ తరిగిపోతున్నది మా కందుబాటులోవున్న సరోవరం.
పంచభూతాలతో ప్రాణాధారమైన నీరు ఉపరితలాన కాక
పుడమి అట్టడుగుల్లో తల దాచుకుంటోంది.
గొంతు తడిచేసేందుకు భగీరథయత్నం చేస్తున్నాం
వెలుగూ-నీరూ కరువైనాయి నేస్తం! పిలవని పేరంటంలా
నవగ్రహాలను మించిన ధరలగ్రహం అరుదెంచింది
నేలనూ నింగినే కాదు
సగటు మానిసి జీవన ప్రాంగణాలనుకూడ దుర్భరం చేసింది
ఇక చాలనుకుంటాను దోస్త్! వివరాలు!!
ఏ పచ్చని ప్రాంతంలో ఉన్నావో ఎందుకు నీకే బాధ?
అంతా కులాసే మరి! ఇక సెలవా!

---

* ఎల్. ఐ. సి. అసిస్టెంటు, జీవనప్రకాశ్; హైదరాబాదు.

# అప్పుడు !

అయ్యదేవర పురుషోత్తమరావు, బి. ఏ. *

పాగిపోతున్న బండిచక్రం సీల జారిపోయింది
పర్వతా రోహణంలో కాలుజారిపోయింది
సందడిగాఉన్న పెళ్ళిపందిరికి నిప్పురవ్వ అంటుకుంది
ఎడారిలో పాంథుని పెనుగాలి పెనవేసుకుంది.
అశ్వమేధహయం కనుపించకుండా పోయింది.
ప్రకటించిన పాత్రధారి అంతుతెలియలేదు
ప్రదర్శన శాలనుండి క్రూరమృగం తప్పించుకుంది
అందమైన అమ్మాయి తుంటరికి ఒంటరిగా కనుపించింది
చిలిపిపిల్ల చిరునవ్వు చిందించింది
త్రాచుపాము తోక త్రొక్కటం జరిగింది
ఆవు దూడను పెట్టింది, మాయవేయలేదు
పిచ్చివానిచేతికి వాడికత్తి దొరికింది
కుండెడు పాలల్లో విషబిందువు చిందింది
ఇంట్లో ఉంచిన ఎలుకలమందు కనుపించటంలేదు
అమాయక ప్రజలకు అపకారం అందింది
సమరంలో నాయకుడు కనుపించటం లేదు
మంచిమనిషి మనసు వికలమై పోయింది
తలుపులువేసి పిల్లిని కొడుతున్నారు
పేదవానికి పెన్నిధి లభించింది
వెలయాలు పవిత్రబంధం అర్థించింది
ప్రవాహానికి అడ్డుకట్ట తెగిపోయింది
శుభకార్యానికి పోతుంటే అపశకునం ఎదురైంది
కలసిఉన్న కొన్నాళ్ళకు కామమ్మ మగడు కారనితెలిసింది
తప్పుకప్పిపుచ్చటానికి చేస్తున్న తప్పులు మితిమీరుతున్నవి.

---

* స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు; హైదరాబాదు.

## నిరంకుశులు

ఇరివెంటి కృష్ణమూర్తి *

పూచిన తలపులన్నీ
తూచినట్లుండాలనుకునే వాళ్ళు
నిరంకుశులు.

తమకు తప్ప ఇతరులకు
మంచి తలపులు రానే రావనుకునేవాళ్ళు
నిరంకుశులు.

అందాన్ని, కవిత్వాన్ని
మానవ స్వభావాన్ని నిర్వచించేవాళ్ళు
నిరంకుశులు.

భజనను సృజనగా
స్వసుఖం పరసుఖంగా
తమ నుదుటిని తూరుపు కొండగా భావించే వాళ్ళు
నిరంకుశులు.

ఆయుధాలను నమ్మేవాళ్ళు
మనిషిని, మనస్సును నమ్మనివాళ్ళు
దేవుడు లేనేలేడని
తామే దేవుళ్ళమని నమ్మే వాళ్ళు
నిరంకుశులు.

అనే హక్కు-కావాలనుకునేవాళ్ళు
వినే అలవాటు లేనివాళ్ళు
మార్పులేక చంపుతామనేవాళ్ళు
నిరంకుశులు.

---

* అధ్యాపకులు, సికిందరాబాదు సాయం కళాశాల; ఉస్మానియా విశ్వవిద్యాలయం.

## అలజడి

మాల *

తడి ఆరిన గుండెలో
వెలుగు లారిపోతున్నాయని అలజడి
మమతలు తెగిపోతున్నాయని
సమతలు సమసిపోతున్నాయని
రేగిన చిచ్చుల జడి యీ అలజడి
ఐకమత్యానికి ఆయువు తీరిందేమోనని
విచ్ఛిన్నంకోసంకూడా చిచ్చుల
అలజడి తప్పలేదే అని
ఎందరు కవ్వడులు కలసి రేపిన
సవ్వడుల జడి యీ అలజడి
ఆహుతైన ఆత్మల చుట్టూ
ఘోషించె గోడల సవ్వడుల జడి
తడియారిన గుండెలో
మండే చిచ్చుల సవ్వడి
ఈ అలజడి.

---

* జి. కుమారస్వామినాయుడు, విద్యార్థి, ప్రాచ్య కళాశాల: హైదరాబాదు.

## అంకితం

పింగళి జగన్నాథరావు *

అనంత సృష్టిలో నిక్షిప్తమైన కరుణ నిండిన నీ చూపుల చల్లని కిరణాలు
నాదు హృదయమును మానసమును కడకు రక్తనాళములనుగూడ ।
నిర్జీవముగ జేసివైచె.
నీ దివ్యతేజఃకలిత సమున్నత విగ్రహమ్ము
ఇంత ఆరోగ్యవంతుని నన్ను నీరసునిజేసె
విశ్వమోహనాకృతి ! నీ విలాస సముచ్చయామృత వర్షమ్ములోన
హరుని కోపాగ్నికీలల కాహుతికాకయుండి
మన్మథుడు విశ్రమించుచు నున్నవాడు.
ప్రకృతీ సముదయమ్ములోని నిష్కాపట్యమునకు తావలమ్మైన,
వెన్నెలవంటి నీ నిండు నవ్వు నాదు హృదయమున నింపినది
మాధురీరుచుల ఘోరకాకోల విషము ।।
నవ్యమాధుర్య నవనీత హృదయమ్మునీది।
దివ్యసౌందర్య విగళిత పుష్పోపమాన మానసమునాది।
స్వచ్ఛదరహాస జ్యోత్స్నాతపమ్మును చిలుకరించి
నాదు హృదయాన రగిలెడు అగ్నికాజ్యమ్మువైతి।
ఓ మహానీయ సౌందర్య రస రూపిణీ!
నీవు మాటాడ గడిపిన స్వల్పకాలమదియె
నాదు ప్రాప్తమనుకొని జీవితము గడిపివేతు
మధురస్మృతులను మనసున నింపుకొనుచు,
కాని, మరువలేనిక నిన్ను ఎన్నిజన్మాలకయిన.
మాటలతొ నేనేమి చెప్పంగ లేనునీకు
నాది అన్నది సర్వమ్మునీకె అంకితమ్ము
నిన్నుజూచి హృదయము మూగవోయి
ఇని ఉండిన యేమియు లేనివాడనైతి !

---

* ఉపాధ్యాయులు, హైదరాబాదు.

# బ్రతుకులోని తియ్యదనం

వంగపల్లి విశ్వనాథం *

ఉవ్వెత్తున లేచే కదలి అలలు అలజడిని స్ఫురింపవు
ప్రతి కదలికకూ కదలి_
అల్లల్లాడిపోయే గడ్డిపోచ మెలుకువ_
అలజడిని స్ఫురింపించదు,
ప్రతిక్షణం ప్రాణంపోసే సూర్యకిరణానికి
ఉగ్గబట్టుకున్న ప్రాణంతో నిరీక్షించే
పూమొగ్గల రేకులు విప్పుకుంటున్నప్పుడు
అలజడి వినపడదు.
కనపడకుండా కారుతున్న కన్నీరు వెనుకనున్న
అలజడి కనపడదు.
కనబడని అలజడి, వినపడని అలజడి,
ఈ జడుల మధ్య, గమనించగలిగిన స్పృహ ఉంటే!
మన మనస్సులో మెదిలే అలజడి
మాత్రమే మనకు తెలుసు.
ఒక్కసారి, అదీ తెలియచెప్పుకోటానికిరాదు చేతకాదు.
అందుకే_అలజడి
అందరి మనస్సుల్లోనూ ఉంటుంది
మూగ ప్రాణుల్లోనూ ఉంటుంది.
చూడగలిగే ఓర్పు,
ఊహించగలిగే నేర్పు, ఉంటే _
అలజడిని గమనిస్తే_
కన్నులకు చెమ్మగిలే గుణం అలవడి
బ్రతుకులోని తియ్యదనం తెలుస్తుంది.
అనుక్షణం బ్రతకటంలోని అవసరం తెలుస్తుంది.

---

* వాణిజ్య శాస్త్రోపన్యాసకులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం; హైదరాబాదు.

# నేను విద్యార్థిని

టి. కె. విజయకుమార్ *

నేను విద్యార్థిని,
రాజకీయాల రాణివాసంచేయడం
అరాచక శక్తుల నణచడం నాపని
కనీసం అనుకుంటాను।
నేను రాజకీయాల్లో పావునేకాదు ప్రథముణ్ణి, ముఖ్యుణ్ణి
ఈరోజు నేనులేకుంటే
ఏ సమ్మె జయప్రదం కాదు_ఏ అభీష్టం నెరవేరదు.
ఏ నాయకుడూ నిలువలేడు ఏ ఉపాధ్యాయుడూ విద్య గరపలేడు.
ఏ పార్టీ తన బలాన్ని పుంజుకోలేదు.
కళాశాలల్లో కూడా ఎలక్షన్లు జరిపి
అరాజకమైన విద్యకు ఓనమాలు దిద్దుకుంటున్నాను.
పంచాయతీబోర్డు మెంబరునుండి ఇండియా ప్రెసిడెంటువరకు
విద్యార్థులూ_రాజకీయాలు ఒక సమస్య
విద్యార్థులు చేయికలపక పోతే
వారికి ఓట్లూ_సీట్లూ కూడా ఒకసమస్యే।
అందుకే_నన్ను విద్యార్థినాయకుణ్ణి చేసి
వారి నాయకత్వానికి పటుత్వం చేకూర్చుకుంటున్నారు
నాకన్నిరంగాలలోను విలువా_మన్ననా ఉన్నాయి.
అందుకే నేను జీవితాంతం_విద్యార్థిగా ఉండాలనుకుంటున్నాను.
కళాశాలల కాళ్ళు పట్టుకున్నా
విశ్వవిద్యాలయాలను వేడుకున్నా
పట్టా చేతికిచ్చి నిరుద్యోగి ముద్రవేసి
మా సంఖ్యాబలాన్ని పెంచుతున్నాయి.
అక్కడ - మాజీ విద్యార్థిగా నిరుద్యోగ సంఘాన్ని
స్థాపించి నాయకుణ్ణవుతానని_వాళ్ళకు తెలియదు.

---

* విద్యార్థి, ప్రాచ్యకళాల; హైదరాబాదు.

## నా ఎదలో వ్యవసాయం

జీడిగుంట కామేశ్వరరావు *

మమత జల్లు కురియక
మానవత మొలవక
సహృదయత పుష్పించక
కరుణరసం తొణికిసలాడే
సౌజన్యం ఫలించక
మనసు పెరడంతా
ఎన్నడో బీడుపోయింది।
అందుకే—ఆతర్వాత
ద్రోహపు మన్నుజల్లి
పరుల మంచితనపు
ఎరువులు వేసి
దౌర్జన్యపు నాగలితో
ఆ పెరడంతా చదునుచేసి
అన్యాయపు విత్తనాల్నినాటి
అక్రమ వృక్షాల్ని పెంచి
వంచనను పండించి
భుజిస్తున్నాను।
నిరాశలోని మాధుర్యాన్ని
అనుభవిస్తున్నాను ।।

---

* భౌతికశాస్త్రోపన్యాసకులు, న్యూసైన్సు కళాశాల, హైదరాబాదు.

# విరజిమ్మునులే !

తిరుమల శ్రీనివాసాచార్యులు *

పుస్తకాలు పట్టవలసిన మస్తకాలు
కుస్తీలు పడుతున్నప్పుడు—
అక్షరాలు వ్రాయలేని హస్తాలు
బడిపంతుళ్ళను బాకులతో పరీక్షిస్తున్నా

ఛందంలోని అందం
గణంలోని గుణం
అక్షరం వెనకనున్న అంతరార్థం—అవేమీచూడక
పద్యం అనగానే పళ్ళుకొరుకుతూ కళ్ళెర్రజేసే
కవిపుంగవులు కనబడుతున్నా

కదలడం కదలించడం మరచి
విశ్వజనీనతను వేళ్ళంటా తుడిచి
కలాలు వెలసిపోయే
కలర్లు పులుముకుంటున్నా—

మూడు గంటలు మంచి 'మూడు'లో
చిత్రాన్ని చూచిన మిత్రులు
జాతీయగీతాన్ని వినకుండనే జారుకుంటున్నా

పల్లె కాలిపోతున్నా
మల్లె మాడిపోతున్నా
విశాల హృదయాలెన్నో
నిశలను తరిమేస్తూనే
తుషార సుందరమౌ ఒక
'ఉషస్సు' విరజిమ్మునులే!

* ప్రధానాంధ్రోపన్యాసకులు, సర్దార్ పటేల్ కళాశాల; సికింద్రాబాదు.

# వికాసలహరి

జాతి సర్వతోముఖ వికాసానికి సాహిత్యం శక్తిమంతమైన సాధనం. పది శతాబ్దాల తెలుగుసాహిత్య చరిత్రలో సాహితీ జగత్తును సమకాలీన సమాజ భవిష్యత్తును వికాసలహరిగా పొంగించిన సారస్వత మూర్తులు ఎందరో ఉన్నారు. వారిలో పంచరత్నాలను ఎంచుకొని యువభారతి ఈయేడు సాహితీ సమాలోచన కార్యక్రమాలను ఉపన్యాస లహరిగా 'వికాసలహరి' గ్రంథప్రచురణగా నిర్వహింప దలచుకొన్నది.

గాసట బీసటలుగా కథలనల్లుకొంటున్న ఆంధ్రజాతికి ఆదికావ్య నిర్మాణ వికాసాని కలించిన నన్నయ, గీర్వాణ భాగవతాన్ని తెలుగు ప్రజానీకానికి భక్తిరసాయనంగా అందించి ప్రజలలో కవితావికాసాన్ని సాధించిన ప్రజాకవి పోతన, సమగ్ర కావ్యకళావిష్కారాన్ని కళాపూర్ణోదయంగా కల్పించి, వాస్తవిక జగత్తుకూ కల్పనామహత్తుకూ, జీవితసత్యాలకూ, కావ్యకళాలక్ష్యాలకూ నూత్న వికాసోల్లాసాన్ని కల్పించిన పింగళి సూరన, నవ్యసాహిత్య ప్రక్రియా విలాసానికీ, నవ్యసమాజ సంస్కృతి వికాసానికి వాఙ్మయాస్త్ర సవ్యసాచిలా ప్రయోగించి ప్రగతిని సాధించిన వికాసమూర్తి కందుకూరి వీరేశలింగం పంతులు, పరభాషా సాహిత్యాల ప్రభావంతో పరాఙ్ముఖమైన జాతిని మాతృభాష వైపు మరలించి పద్యాన్ని శ్రవణానందంగా ఆలపించి, కవితాప్రవృత్తికి జాతిలో పునర్వికాసాన్ని కల్పించిన తిరుపతి వేంకటకవులూ యువభారతి ఎన్నుకున్న సారస్వత మూర్తులు.

సమకాలీన సాహిత్య రథసారథులు, బుధశేఖరులూ వారినిగూర్చి ప్రసంగించే ఉపన్యాసకులు :

| | | |
|---|---|---|
| 7 అక్టోబరు 73 | నన్నయ | ఆచార్య దివాకర్ల వేంకటావధాని |
| 21 అక్టోబరు 73 | పోతన | డా॥ సి. నారాయణరెడ్డి |
| 4 నవంబరు 73 | పింగళి సూరన | డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం |
| 18 నవంబరు 73 | కందుకూరి వీరేశలింగం | ఆరుద్ర |
| 2 డిసెంబరు 73 | తిరుపతి వేంకటకవులు | ఆచార్య దివాకర్ల వేంకటావధాని |

" వికాసలహరి " 2 డిసెంబర్ '73 నాడు ఆవిష్కరింప బడుతుంది. ప్రచురణ పూర్వవెల 3_00. 1973లో సాహితీమిత్రులుగా చేరేవారికి వికాసలహరి ఉచితం. యువభారతిలో సాహితీమిత్రులుగా చేరి, సాహితీ వికాసానికి దోహదం చేయండి.




# సాహితీమిత్రులు
# * యువభారతి




స్పందనం జీవలక్షణం।

రసస్పందనం సహృదయలక్షణం।

మా కృషిలో పాలుపంచుకునేందుకై సహృదయులైన సాహిత్యాభిమానులకు అందిస్తున్న ఆహ్వానం 'సాహితీమిత్ర'. జాతి పురోగమనానికి సాహిత్యవికాసం, దాని ప్రభావం అవసరమని భావిస్తూ ఉత్తమ సాహిత్య ప్రచురణానికి యథాశక్తి ప్రయత్నిస్తున్నాము. 'సాహితీమిత్రులు'గా చేరడం అంటే మీ సహాయ సహకారాలను మా సాహిత్యకృషికి అందించటానికి ఒప్పుకుంటున్నారన్నమాట। యువభారతి సాహితీమిత్రులుగా చేరడంవల్ల సమకూరే సదుపాయాలు :

* ప్రతి సంవత్సరం అయిదు రూ॥ చెల్లించడంతో యువభారతి సాహితీమిత్రులుగా పరిగణింపబడతారు. సాహితీమిత్ర సభ్యత్వ చిహ్నం అందుతుంది.

* తక్షణమే ఒక ఉచిత పుస్తకం. 1973 వ సంవత్సరంలో రు. 3/- ల ప్రచురణ పూర్వ విరాళంపై ప్రచురింపబడే 'వికాసలహరి'ని మీకు ఉచితంగా - నేరుగా అందించడంగానీ, పోస్టుద్వారా పంపడంగానీ జరుగుతుంది.

* 1973 లో యువభారతి నిర్వహించే కార్యక్రమాల వివరాలు, ఆహ్వానాలు అందుతాయి.

* 1973 లో మీరు యువభారతి ప్రచురణలను 25% మినహాయింపుతో - కొన్ని సమయాలలో అంతకన్నా ఎక్కువ మినహాయింపుతో మీరు సొంతం చేసుకోవచ్చును.

* అన్నింటికన్న మిన్న యువభారతికి తోడ్పడగలుగుతున్నామన్న సంతృప్తి, మీకా సంతృప్తి కలిగించేలా, యువభారతిని తీర్చిదిద్దడంలో మీ సహకారం అందించటం.





సమాజంలో సాహిత్యం
కావ్యలహరి చైతన్యంలా
సవలాస్యం చేయాలని
యువభారతి లక్ష్యం!
సాహితీ మిత్రులుగా
యువభారతి సంస్థ మీకు
ఆహ్వాన మందిస్తున్నది

సాహిత్యకళా సంస్కృతి సాధనకూ
సమ్యక్ శోధనకూ
విస్తృత స్నేహారాధనకూ
విశ్వశ్రేయ స్సాధనకూ
'సాహితీమిత్ర' పథకంలో
సభ్యులుగా చేరండి
విశేషాలకు, వివరాలకూ

యువభారతి

సాహితీసాంస్కృతికసంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

